శ్రీరస్తు.

# విజయసేన మహారాజు నాటకము




గ్రంధకర్త

నల్లమేకలపల్లె బ్రహ్మానంద యాశ్రమనివాసియగు

మాదశాస్త్రి కాశయ్య.



ప్రథమ ముద్రణము.

500 కాపీలు.

తాడిపత్రి దేశబంధు ముద్రణాలయమునందు

ముద్రింపఁబడినది.

1928




వెల 0—12—0

# పీఠిక.

---

శ్రీమదఖండ సచ్చిదానంద స్వరూపాభిరాముఁడగు పరమేశ్వర స్వకల్పితమైన మాయారచితంబైన లోకంబులో పుణ్యభూమియనివి నుతిగాంచిన భరతఖండము నందనేకులైన మహాపురుషులు, లోకంబునకు మేలుజేయఁదలంచి, ఋషిప్రోక్తంబులైన గీర్వాణభాషా గ్రంథంబులందలి మర్మధర్మంబుల లోకంబునకు వెల్లడింపఁదలంచి గద్యపద్యాత్మకంబుగా రచియించిరి. అందలి ధర్మంబులు ప్రమాణయుక్తంబుగా నెఱిఁగిన మాన్యులఁ జేరి యెఱుంగని కతనంబునఁ జేసి వివేకంబణంగి అవివేకంబు తలయెత్తి తాండవింపఁజొచ్చె. అట్టిసమయంబున విజ్ఞులైన మాన్యజనంబులు పురాణోక్తధర్మంబులెఱిఁగి యవి దెల్పఁబూనిన, రోగికి పథ్యాహారంబు రుచింపనట్టి విధంబున ధర్మకర్మంబు నందభిరుచి లేకపోయె. అందుకుమాఱుగా యిక్కాలంబున పురాణగోప్యంబులగు మర్మంబులు కామవికారజనితంబులైన నాటకంబులును కథలుగా వ్రాసి అవినచ్చోత్తించి వెల్లడించిరి. అందలి ధర్మమర్మంబెఱుంగఁజాలక భ్రమించి అందలివిషయంబు తమవిషయంబునకు దృష్టాంతముగాఁ గైకొని తాచెడ్డకోఁతి వనంబెల్ల చెఱిచెనను లోకోక్తిచందంబుగా, వారు చెడుటయేగాక తమ్ముసమీపించిన జనాదులందఱిని జెఱుపంజూచిరి. ఇట్టియుదంతమంత పూజ్యులైన మహానుభావులు కొందఱు యెఱింగి నెఱుంగనిచందంబున నూరకయుండిరి. అందులో కొందఱు లోకానుగ్రహంబు జేయఁదలంచి యనేక నష్టకష్టంబులకోర్చి ధర్మంబు నెఱింగింపఁబూనిన దుష్కర్మబద్ధులైన అవివేకులు నిందింపుచు హాస్యంబు జేయఁదలంచిరి అయినను అట్టినిందావాక్యంబులు వారికి మేలేయొసంగుచున్నవి. ఎట్లన సూర్యునిముఖంబున దుమ్ము జల్లఁబోయిన తమకండ్లలో బడినచందంబున, పుణ్యాత్ములనిందించిన అవివేకులు వారార్జించిన పాపఫలంబు గైకొంచు వారికి మేలేజేయుచున్నా

రు. ఈచందంబు అజ్ఞలెరుంగరు. వీరియుదంతమంతయు వ్రాయవలయునన్న నొక్క పెద్దగ్రంథము కాగలదు. యింతటితో విరమించి ప్రకృతము విన్నవించునదే మన; వ్యాకరణ ఛందశ్శాస్త్రంబు లిసుమంతైన కనివిని నెఱింగినవాఁడ గాను. అయినను బుధజనంబుల పదరజంబు అప్పటప్పటికి నాశిరంబు పావకతనంబుజేసి, కామోద్రేకంబు గలిగించు నాటకంబులు గాంచిన ప్రజాసమూహంబు విషయనివృత్తి నెఱుంగనికతనంబునఁ జేసి, చెడుచున్నదున, అప్పుడప్పుడు బాల్యస్నేహితులైన నామిత్రులు విషయవ్యాప్తి మెండుగాయున్న నాటకంబులగాంచి అందలివిషయంబులు నాకెఱింగించుచున్న, నామనంబునఁ జింతిల్లి, ఈశ్వరానుగ్రహంబునఁ మానవుండై జన్మించి, విధివిహితానుష్ఠాన కర్మఫలంబు సర్వేశ్వరునికి అర్పింపఁజాలక ఇట్టి చిత్రచారిత్రంబులగు కామాతిశయంబులగు కథలు నాటకంబులుగా రచియించిన పుణ్యాత్ములు యేమేలుపొందగోరి రచియించిరో నే నెఱుంగకపోయినను, పై వచించినవ్యాకరణ ఛందశ్శాస్త్రం బిసుమంతైన నెఱుంగకున్న వాఁడనై నామనస్సాక్షియైన సర్వేశ్వరానుగ్రహంబునఁ జేసి నేరచింపఁబూనిన విజయసేనచరిత్రంబను కథాసరణి నాటకంబుగా మార్చిన, కొన్ని ధర్మమర్మంబులు లోకంబునకు వెల్లడియగునని మనంబునందూహించి వియత్నంబునఁ జేయించు పక్షింద్రివెనుకొనఁ బూనుదోషచందంబు నాయత్నంబు అయినను, సత్యంబునకెన్నియిక్కట్లు పొసగినను, ఈశ్వరానుగ్రహంబునకష్టంబునష్టంబుగావించి సుఖించుటకిసుమంతైన సంశయముండదను విషయంబునకునిదర్శనంబుగా నుండునని ఈకథాసంగ్రహంబు వ్రాసినాఁడ. నిందలితప్పులెన్నక విషయంబు గ్రహింతురని పూజ్యులైన మహాపురుషులకు వందనంబాచరించి విన్నవించువాఁడ.

ఇట్లు, తమవిధేయుఁడు,

నల్లమేకలపల్లె.
28-2-28

బ్రహ్మానంద యాశ్రమనివాసుఁడగు,
మాదొడ్డికాశయ్య.

# యీనాటకమున వచ్చుపాత్రల వివరము.



పురుషులు.

[1] సత్యసేనమహారాజు ... విజయసేనుని తండ్రి.
[2] ధర్మపాలుడు. ... సత్యసేనునిమంత్రి.
(3) పౌరులు ...
(4) దుష్టసేనమహారాజు. ... సత్యసేనమహారాజు తమ్ముడు
(5) యంకడు సుంకడు. ... దుష్టసేనుని ప్రధానసేవకులు.
(6) విజయసేనుడు. ... సత్యసేనుని కొ॥ కథానాయకుఁ
(7) రాక్షసుడు. ...
(8) చోరుడు. ...
(9) విష్ణుమూర్తి. ... వైకుంఠాధిపతి.
(10) కీర్తిపాలుడు. ... పుళింద రాజ్యపుమంత్రి.
(11) పుచ్చలసోముడు గచ్చలరాముడు బెస్తవాండ్లు.
[12] గోవిందప్పశెట్టి. ... వర్తకుడు.
[13] చలపతిరావు. ... వర్తకుని గుమాస్తా.
(14) దఫేదారు. ... కోర్టుజవాన్.
(15) పోలీసుఇన్సుస్పెక్టరు. ...
[16] మురారిరావు. ... వకీలు.

స్త్రీపాత్రలు.

(1) సుశీల. ... సత్యసేనమహారాజు భార్య.
(2) విమల. ... కథానాయకుని తోడబుట్టు.

యింకా కథానుసారములో కొన్ని స్త్రీపాత్రలు రాగలవు.

శ్రీ ర స్తు.

# విజయసేన మహారాజు నాటకము.



—: నాంది :—

శా॥ శ్రీరాముꣳ సురసేవ్యమాను మదిలోꣳ జింతించి విశ్రాంతికై॥
గారాబంబున బుద్ధివృత్తిగుణముల్ దైకొక తీవ్రేచ్ఛచే!
ఘోరాఘుంబుల బారిబాసి విబుధుల్ కైవల్యమత్యున్నతిꣳ।
జేరంజూడదలంతు రట్టిపదముꣳ సేవింతు నెల్లప్పుడుꣳ॥

ప్రస్తావన.

ప్రవేశము—సూత్రధారుడు

పాట- జైలాగ్- శంకరాభరణము -ఆది

సంతసమొదవెను సభవైభవము
మంతనమునకు నేడెంతయు జూడా॥ సం॥
నిర్మలమతుల కర్మరహితుల
పేర్మినిజూడగ ధర్మమొదవెహా॥ సం॥
భాసురబ్రహ్మానంద చంద్రశేఖరునితమ
భావములందున ప్రస్తుతించెదరూ॥ సం॥

గీ॥ ఈసభికులను గాంచగానిపుడు మదికి
మోదమొదవెను సంతోషమావహిల్లె
పూర్వభవమున నేజేయు పుణ్యమేమొ
లేకయుండినగల్గునే శ్రీకరముగ॥

వచన॥ ముందుజన్మంబునꣳ జేసిన సుకర్మ విశేషంబునꣳగాక వేరు

మార్గంబున యిట్టిమహాజన సభాసందర్శనంబు గల్గునా? ఆలస్యమొనరింపక నామిత్రులంబిలిచి యొక్కసత్యచారిత్రంబు ప్రదర్శించి వీరిమనంబులకు సంతోషంబు గలుగజేసెద.

(అని తెరవైపుజూచి) మిత్రమా! [స్వగతము]ఏమినామిత్రుడురాక తడవ్వుటకు గతంబేమిగాయుండును?

(అనిచింతిల్లి నట్టునటించి వచ్చుచుండుమిత్రునిజూచి) మిత్రమా! రమ్ము.

మిత్రుడు॥ ఓహోవచ్చితి కర్తవ్యమేమి.

సూ॥ ఏలయింతసేపు తడవుజేసితివి.

మి॥ గృహకార్యాదులుండుట గొంచము నిదానించితి. పనియేమివచింపుము.

సూ॥ పనియేమనినుడివెదవేల. ఈసభాసమూహము గాంచిన తెలియదా.

మి॥ ఓహో చూచితి నిందువిద్వాంసులా? శ్రీహరిపదంబులునుతించు భక్తబృందంబులా? సర్వసంకల్ప శూన్యులై లోకోద్ధరణప్రవర్తకులైన మాన్యులా? వైరాగ్యాది సాధనంబులంజేజరిల్లిన పుణ్యాత్ములా? ఇట్టివారెవ్వరు చూపట్టరైరే? వీరిసందర్శనంబున లాభమేమి?

సూ॥ నీవచించిన మాన్యులేగదా ధర్మమార్గంబు తెలియుటకుగాను శ్రుతిస్మృత్యాదుల మర్మధర్మంబులు లోకంబున వెదచల్లుట॥

మి॥ అవును. అట్టిధర్మంబుల యందిచ్చబూను వారెవ్వరు? ఇక్కలిజనాదులు భూతద్రోహులు, మాంసాశనులు, మద్యపానరతులు, సురతాసక్తులు, జూదరులు, న్యాయహీనులు, వేదదూషకులు, వేదవిక్రేతలు, మంత్రహీనులు,మంత్రవిక్రేతలు. ఇట్టిఅవివేకులుగదా యెక్కుడగాంచిన గుంపులు గుంపులుగాజేరి కొంపగూల్చెడు ప్రసంగంబులకాలము జరుపుచుందురు. వీరిచర్యచెప్ప వలయునన్న

నొక పెద్దగ్రంథమే కాగలదు. ఇంతటితో విరమించెద. వీరిజోలి
మన కేల? పోదమురమ్ము

గీ॥ ధరణి సజ్జనసాంగత్యసరణిచేత
విషయవిస్మృతిగల్గియీ విశ్వమందు
దూరమేగును దుష్కర్మ దుష్టజనము
మేలుఘటియించు సుఖమిచ్చు మేదినందు.

వచ॥ సజ్జనసాంగత్యము వలనగదా భవంబుదరించుట. దుర్జనసాంగ
త్యము మనకెందుకు? వెళ్లుదమురండు.

సూ॥ ఉ॥ స్వామికి భృత్యులై ధరనుజూడగనుందురు మర్మవేషులై
సోమరులందరున్ గనగజూతురె వారిని చోద్యమయ్యెడున్
పామరులందుజేరి భ్రమపాల్పడకెప్పుడు నిర్మలాత్ములై
శ్రీమహితోన్నతిన్ వసుధ శ్రీహరిచింతన పూర్ణచిత్తులై॥

మి॥ అయ్యో అట్లుండిన అందరూపుణ్యాత్ములనియే చెప్ప నొప్పగు.

సూ॥ కొందరుండినంతనే అందరుపుణ్యులెట్లగుదురు?

మి॥ పుణ్యపురుష సందర్శన స్పర్శనఅవలోకనాదులచే అందరు పు
ణ్యాత్ములయ్యెదరను శాస్త్రోక్తి వినియుండమా?

సూ॥ అవును. అట్టి పుణ్యమానసుండైన విజయసేనమహారాజు చరి
త్రంబువినువారికి ధర్మంబునందు బుద్ధికుదరకమానదు.

మి॥ అవును. విజయసేనమహారాజుచరిత్రము నాటకముగానుండిన నీ
రిశ్రోత్రంబుల కానందంబుగా నుండునుగాదా?

సూ॥ అవును. అది నాటకంబుగా మారినది. నాటకంబుగా రచియిం
చిన సుమతియెవడు

మి॥ సీ॥ పెడకంటికులములో పుడమిపైజన్మించి
విబుధులసేవచే వెలయువాడు
తాపత్రయంబుల తలపునువర్జించి
పరమేశునిష్ఠమెబరగువాడు

రాగాదివిషయముల్ భోగంబులనుమాని
భక్తిశ్రీహరియందు బరగువాడు
లోకోపకృతికినై ప్రకటంబుగ నోపి
సత్కర్మమెప్పుడు సలుపువాడు
గీ॥ విషయజాలంబులను వార్త విడుచువాడు
పొనగకాశయ్య యనుపేరుపొందినాడు —
అసదృశంబగు వస్తు వందాశమాని
సత్యమునుగాంచి మదిసంతసించువాడు.

సూ॥ సఖానీవుచెప్పిన మాన్యుండు ఛందోలంకారంబు లెఱింగిన వాడుగాడనితోచుచున్నది.

మి॥ అవునునీవన్నట్లు కావ్యాదులెఱింగి చెప్పఁబూనిన వాడుకాడు. విబుధుల పాదధూళి శిరంబునసోకుటంజేసి యీప్రజ్ఞ గలిగినది.

సూ॥ అట్లయినవ్యాకరణాదిదోషంబు లిందుచూపట్టకమానవు.

మి॥ గీ॥ శుకమునకుపల్కులను నేర్పిసుస్థిరముగ
పల్కఁబూనిన వాక్యముల్ పరిగణించి
ఆత్మలను మోదమందెదు నట్టిమాడ్కి
తప్పులనుమాని యొప్పులు జెప్పకొందురు॥

సూత్రధారుడు-మిత్రుడు పాట - తైలంగు శాహాన ఏకతాళము

రామరమ్మ నీపదంబు వేమరు స్మరించెదనూ
వేమరుస్మరించెదను వెతలుబాపు సతతమును ॥రామరమ్మ॥
నిత్యమంచువిషయములను హత్తుదవిలియెపుడుధరను
మత్తుడనైచెడితినన్ను మాన్యజనుల జేర్చిబ్రోవు ॥రామర॥
వసుధ బ్రహ్మానందయాశ్రమ వాసచిద్విలాసరారా
దాసదాసదాసులమై దోశిలొగ్గివేడినాము॥ రామరమ్మ॥

—c—

శ్రీ ర స్తు.

# విజయసేన మహారాజు నాటకము.

—ఀఀఀఀఀ—

## ప్రథమాంకము

### రంగము 1

ప్రవేశము — రాజు మంత్రి

పాట - కైలాగ్ బ్యాగ్ రాగము రూపకము

రా॥ మానుగమన రాష్ట్రజనులు మంత్రివరా క్షేమమా॥
నసయముగా కెరుగ దెల్పు విని మోదా మనంబునా॥ మాను॥
మంత్రి॥ భాసురముగ రాష్ట్రజనులు దోసమేమిలేకనూ॥
వాసిగశుభవైభవముల వొప్పియుందురు ధీమణీ॥ భాసు॥
రా॥ వేదవిహితమైనకర్మ మోదమున జనంబులూ॥
సాదరముగ జేయుచుందురె మేదినందు జూడగ మాను॥
మంత్రి॥ లోభవృత్తిలేకశక్తి కొలది విహితకర్మముల్
లాభమునుమదివీడి ఈశ్వరార్పణముగ జేతురు॥ భాసు॥
రా॥ గీ॥ జగతిమానవజన్మంబు శ్రేష్ఠమండ్రు।
తెలివిగల్గియు ధర్మంబు దెలిసియున్న।
ధర్మహీనత జన్మంబుదాల్చువాడు।
పశువుకన్నను హీనుడౌ పరగజగతి॥

మా॥ మంత్రివరా! అవినీతుడయి ధర్మంబు బోనాడి దుష్కర్మమున కొడిగట్టి ప్రజలపాలించుటలో న్యాయహీనుడైన రాజు నరకంబుతీవ్రగతి జేరగలండని ధర్మశాస్త్రంబులు ఘోషింపుచున్నవిగదా.

మంత్రి॥ నిర్మలాత్ముండవై న్యాయంబుదప్పక ప్రజలపాలించు నీకుకొ
రతయేమి.

రా॥ శ్రీయఃపతికరుణ అంతటికి ముఖ్యముగదా.

మంత్రి॥ విష్ణుకళాస్వరూపులేగదా పుణ్యమానసులైనరాజన్యులు.

రా॥ సీ॥ సతతంబుహరినామ సంస్మృతికన్నను
మేలుగల్గునె చూడ మేదినందు।
అష్టాంగములసోక సాష్టాంగమొనరించి
మ్రొక్కుటకన్నను మోక్షమున్నె
నిర్మలభక్తిచే నీరజాక్షునిపూజ
గావించుకంటె సత్కార్యమేది
పరమభక్తులగాంచి ప్రియమార సేవించి
సత్కరించుటకంటె శ్రేయమున్నె

గీ॥ యిట్లుగాకను ధాత్రియింకెట్టులైన
బ్రతికియుండినఫలమేమి బహుళముగను।
శునకసూకరగార్ధభజంతుచయము।
బ్రతికినట్టులె శ్రీహరిభక్తిలేక॥

వ॥ ధర్మపాలా నిర్మలంబగు మనంబుతో శ్రీయఃపతిని సేవింపక
విషయగ్రస్తులై చరించుట కన్నకీడుయేమున్నది.

మంత్రి॥ సీ॥ జలజాక్షు భజనంబు చేయుభక్తులయొద్ద।
శ్రీహరి నృత్యంబు చేయుచుండు
సత్యంబుదప్పక చరియించు భక్తుల
యొద్దశ్రీహరియుండు వొప్పుగాను
సకలభూతంబుల సమబుద్ధి భావింప
శ్రీహరివారికి జిక్కియుండు।
సన్మార్గవర్తులుసంచరించెడుచోట
వేడ్కవత్సలతనె వెంటదిరుగు

గీ॥ నామహాత్మునిమహిమ లత్యద్భుతములు
తెలిసివర్ణింపలే రెంతధీరులైన।
నట్టిమహనీయు నాదిమధ్యాంతరహితు
దేవదేవునిమరచిన దెలివిసున్న.

వ॥ తాపత్రయంబను దవానలంబునఁబడి తపించెడుజీవులకుశ్రీ హరిస్మరణ సుధారసంబునకన్న వేరుమార్గంబున ముక్తిగా న్పింపదుగదా? అట్టిదేవుని సేవింపక భ్రాంతికిలోనై నాటకన్నకీ డుయేమున్నది.

రా॥ సీ॥ కమనీయమణిమయ కనకసౌధములేల।
శ్రీనివాసుని పదచింతలేక।
సిందారభుజియించి నెగడినతనువేల।
హరిసేవలేకున్న నవనియందు।
లోకోపకృతికినై ప్రాకటంబుగనోర్చి।
సత్కార్మజేయని జన్మవేల।
బహువిద్యలనునేర్వ ఫలమేమిశ్రీహరి
చరితముల్ నోరూర జెప్పకున్న

గీ॥ అన్నియునిరర్థకంబు తానవనియందు।
నమ్మహాత్మును సేవించియలఘుమతులు।
పాపవెల్లువ దరియించిభ్రాంతిబాసి।
నిత్యసుఖమును గాంచిరిసత్యముగను॥

రా॥ వ॥ సచివోత్తమా! వెల్ల జనంబుల అల్లరిబెట్టక యుల్లంబులురంజి ల్ల చల్లదనంబునపాలించు భూవల్లభులు సత్యసంధులందురు. మనమెట్లుప్రవర్తించిన మనవీటఁగల జనంబులు నట్లేప్రవ ర్తింపగలరు. ధర్మప్రవర్తనంబునకన్న నీతిమంతులకుకార్య ములేదుగదా?

మం॥ వ॥ అవును. అంతకన్న మిన్నయగుకార్యమింకేమియున్నది?

రా॥ వ॥ సచివవరా యీదినంబున విచారించు కార్యంబులేమైననుం డునా?

మం॥ వ॥ భూవరా యీదినంబున విచారించు కార్యంబులేవియుఁ జూపట్టవయ్యె.

రా॥ వ॥ అట్లయిన సభ చాలింతము

మం॥ వ॥ చిత్తము.

పౌరులు — ప్రవేశము.

పాట - జైలాగ్ - బ్యాండు - ఏకతాళము

దండమిపుడు రాజచంద్ర దయనుమమ్ముబ్రోవుము।
నిండువేడ్క నీకృపా నేడఁజూపుమాకును ॥దండ॥

రా॥ వ॥ ధర్మపాలా యీవచ్చుచున్న జనంబులంగాంచిన వ్యసనంబు వీరివదనంబుల జూపట్టుచున్నది. ఏమికారణమొ విచారించి పోవుదము.

మం॥ వ॥ దుఃఖసాగరనిమగ్నులగు వారింగదా యుద్ధరింపవలసి కార్యము భూరమణులకు.

రా॥ గీ॥ ఇంతకాలము మనపురమందునెచట।
దుఃఖజాలము చందంబుదోచలేదు।
దోచెయీకాలమునకేమితొట్రుపాటొ।
యెరుగవలయును వీరలనిపుడయరశి॥

మం॥ వ॥ రాజా వీరికెట్టిదియో గొప్పవిపత్తు గూడినట్టున్నది లేకుండిన ఇంతమందియేడ్పులిటులుంగున రారని తోచుచున్నది.

రా॥ వ॥ అవునవును.అట్లుగానేయున్నది. వచ్చినంతవిశదముగాగలదు.

పాట - (పౌరులు రోదనముచేయుచు) బ్యాండు - ఏకతాళము

కష్టుడైన దుష్టసేనుడిష్టసఖుల గూడియు
నష్టముమాకొదవజేసె నండయగుచు ధీమణి ॥దండ॥

దనుజురీతి వాడు బల దర్పమునను మించియూ
ననయము మాకొదవజేసె నాపదయును భూపతీ ॥దండ॥

పౌ॥ వ॥ రాజా? సేనకృపజూడకున్న యీపురంబున కాపురంబుండుట
భారముగనున్నదిగాన రక్షింపుము.

రా॥ వ॥ అట్టియిక్కట్లుపొసగుటకు కారణంబేమివచింపుము.

పౌ॥ వ॥ మానోటచెప్పకొనుటకు మాకేసిగ్గగుచున్నది. చెప్పకున్న
మాప్రాణంబులుగూడ నిల్వవనితోచుచున్నది. వచించెద
ము. చిత్తగింపుము.

సీ॥ దుష్టసేనుడుజేయు కష్టపుపనులకు।
నోర్వంగజాలము యుర్వినాథ।
మాయిండ్లపైబడి మాయాండ్లబిడ్డల।
బట్టిబలవంతాన భంగపరచె।
నష్టంబుగాబోయి నన్యాయమన్నను।
కంటకుడైమమ్ము కాలదన్నె।
యిండ్లలోజొరబడి యెలమిమావిత్తముల్।
సుస్థిరంబుగదాని చూరగొనియె।

గీ॥ యిట్టికష్టంబులకునోర్చి యీపురంబు।
కాపురంబులునేరీతి నోపిజేతు।
నయ్యయో యుండజాలము న్యాయహీన।
కార్యములకోర్చి కాపురంబుర్వినాథ॥

వ॥ మహాత్మా యీపురంబున కాపురంబుండుట బలుకష్టముగా
నున్నవి గాన అనుజ్ఞనొసంగిన యేదేశమైనను చేరిబ్రతుకగ
లము. వెళ్లుచున్నారము.

రా॥ వ॥ కాపులారా, కన్నుమిన్నుగానక దుర్విచారుండైన యాదుష్
టాత్ముని దండించి మీకుసుఖంబుగల్గునట్లు గావించెద నూ
రడిల్లుడు.

పౌ॥ వ॥ అయ్యో యింకెక్కడిసుఖము. వానిదండించబూనిన నీకు ముప్పువాటిల్లునని మానసంబుల భయంబుగదురుచున్నది.

రా॥ గీ॥ క్రూరదండనగావించి కువలయమున
ప్రజకు మోదంబుగల్గించుపగిది లేని।
నృపతి నరకాబ్ధి జేరును త్వరితముగను।
ననెడు శాస్త్రోక్తి దప్పనేయరశిజూడ॥

వ॥ కాపులారా. మీయిండ్లకడకుపొండు. ఆకలుపాత్ముదండించు నుపాయంబు ధర్మపాలునితో విచారించి సిక్షించెద పొండు.

పౌ॥ వ॥ మహాత్మా నీతమ్మునిదుండగములకు నోర్చిమేముండజాలము. ఆనీచుని జన్మావధిచెరసాలవిధించిననే కాపురంబులుగాని లేకున్న మాగతి యమపురమే. వెళ్లెదము. దయయుంచుము.

రా॥ వ॥ ఆకలుపాత్ముడు దండింపబడుట నిక్కము. ఇంకభయంబు మాని వెళ్లుడు.

పౌ॥ వ॥ (జనాంతికముగా) అయ్యలారా యీరాజు సత్యవంతుడే కాని యీనీచునిచే యేమికీడువాటిల్లగలదోగదా?

పౌ॥ వ॥ అవునవును. మననిమిత్తమా భూపతికినెట్టి ఇక్కట్లుపొసగునోగదాయని చింతిల్లెదము.

పౌరులు. పాట — ౛ైలాగ్

యంతటివిపరీతకార్యముగల్గెను।
యీదుష్టసేనుడు యిపుడిడుములు బెట్టె॥ యంత॥
ధర్మమునకు భంగమిత్తారినెత్తెను।
దుర్మదద్రోహి దుష్కర్మమూనీ॥ యంత॥
నిర్మలమతియీధర్మస్వరూపున

అరయాగనాపద యేమి ప్రాప్తించునో॥ యతం॥
(పౌరులు నిష్క్రమింతురు.)

పాట - డైలాగ్ - శహాన - ఆదితాళము

రాజు॥ సచివరా వింటివే ప్రజపల్కుహా।
నీచుడుయిటుబహుగాసిజేసెనుప్రజ ॥సచి॥

మంత్రి॥ భూవరా నీచుని బ్రోవనడచి ప్రజ।
బ్రోవగవలయును భావమలరగా ॥భూవ॥

రాజు॥ నీచునిబట్టియు యోచననికనూ।
గాసియొనర్చుట కార్యహానమనకు ॥సచి॥

మంత్రి॥ దుర్మద చరితుతా కర్ములగొట్టి।
ధర్మమునిలుపుట తగుధరణీశా॥ ॥భూవ॥

రా॥ క॥ కులపాంసనుడా కలుషుడు।
దలపగధర్మంబుమాని దర్పముతోడన్
చలరేగిప్రజకు ద్రోహము।
ఖలుడైగావించెనిపుడు కష్టాత్మకుడై॥

వ॥ సచివరా,యానీచాత్ముండగు దుష్టసేను నెవ్విధినైన పట్టిబంధింపకున్న ప్రజోపద్రవంబు మానదుగదా. వీని నెవ్విధిపట్టవచ్చునో వచింపుము.

మం వ॥ రాజా యీదుష్టసేనుని పట్టుట కష్టమనితోచుచున్నది.

రా॥ వ॥ అట్లయితే ప్రజలయొక్కగతియేమి?

మం॥ వ॥ వారలగతి దుర్గతియే. నీవేఆలోచింపుము.

రా॥ గీ॥ నీచుడౌదుష్టసేనుని నింకనుంచ।
తగదు తగదనిదోచెను ధరణిలోన॥
నుంచ కీర్తియు యశమును నుండబోదు।

ప్రజకు దోచెనిక్షోభయుగాయకున్న।

రా॥ వ॥ మంత్రివర్యా యవ్విధిమైనా యాకుటిలకర్ముని బట్టి సిక్షింప కున్న మనవీటిగలజనాదుల కష్టంబు నష్టంబు గాదుగదా?

మం॥ సీ॥ శరణన్న నెటువంటి శత్రులనైనను।
రక్షింపనీతి భూరమణులకును।
అభయంబొసంగియు హరితోడ నెదురించి।
గయుగాంచె విజయుడు కరుణతోడ।
తనమేనికండలు తగగోసిశిబియిచ్చి।
పక్షినిబ్రోవడే పరమనియతి।
బోయకాహారమై పోయినపక్షికి।
స్వర్గంబుచేకూరె సుస్థిరముగ।

గీ॥ ధర్మమునహానిలేకుండ ధరణియందు।
వెలగికీర్తియుపొందరే తొలుతన్నృపులు।
గానధర్మంబువదలక గరుణతోడ।
ప్రజలయాపదబాపుట పరమనియతి॥

వ॥ అవును. వాస్తవమే యానీచుకట్టి యత్నించిన మనకేజేటు వాటిల్లక మానదు.

రా॥ వ॥ (స్వగతము) అయ్యో యేమి? యితండిట్లాడుచున్నాడు. దుష్టాత్ముడగు దుష్టసేనునిదాడి బహుళంబుగాయున్నట్లున్నది. లేకున్న యిట్టిదీనపుమాటలు వచింపకుగదా? (ప్రకాశంబుగా)

రా॥ ఉ॥ రాజ్యమదంబునన్ ప్రజల రాయిడిబెట్టియు నీతిదూరులై।
పూజ్యతగాంచిరే నృపులు పూర్వభవంబున నెవ్వరేనియున్
దుర్జయుడంచువీనిబల దర్పముద్రుంపక నీతివీడుటల్।
కర్జముగాదువిన్ము మరికష్టుడటంచును నిందజేయరే॥

రా॥ వ॥ తమ్ముడని యాకుటిలకర్ముని సైచితిమేని లోకంబులో అపకీర్తియు పిదపనరకప్రాప్తియుతప్పదుగాన విధివిహిత కర్మా

చరణులైన రాజులు పుత్రమిత్రబంధుజనంబులని మనంబున నెంచక దుష్టప్రవర్తకుల నెట్టివారైనను శిక్షించిగదా లోకంబున వినతిగాంచినది. యిదిమీకువిదితమేగదా?

మం॥ వ॥ అవును. బంధుభావంబు దలంపక నీతమ్ముని బందికానయందుంచి ప్రజలకు మేలుకల్గునట్లుగావింపుము.

రా॥ వ॥ ఆలాగె వానిబట్టునటుల భటులకాజ్ఞయొసంగుము. నేటికిసభ చాలింతము.

మం॥ వ॥ చిత్తము. అట్లేకానిమ్ము. [అని నిష్క్రమింతురు.]

రంగము 2

ప్రవేశము—దుష్టసేనుడు, మిత్రులు.

పాట - బ్యాగ్‌రాగము - ఆదితాళము.

అందామైనకల్లు పొందుగదాగ్రావాగ
 డెందామానందామాయె
ఔరౌరఈకల్లుదాగ్రినమైకాము
 అతిశయమాయెనహా॥ అందా॥
యింతులగూడీయు కంతునికదసములొ
 మంతానమలరగను
సంతాతమురతి సల్పుటకన్నాను
 సౌఖ్యాములేదూధరా॥ అందా॥
సారాయికన్నాను సారామైనరుచి
 ధారుణిలేదుగదా
సైరాసారాయిని కోరిదాగ్రినవారు
 జేరేరి పరసుఖము॥ అందా॥

వ॥ యేరీనామిత్రులు. ఎందుకొరకో యిందాక తడయుట. వచ్చి

నణ విచారించెద. ఓహో అదో వచ్చుచున్నారుగదా?

మి॥ వ॥ దుష్టసేనమహారాజా దండములు దండములు.
మీకు శుభంబగుగాక.

దు॥ వ॥ మాకెక్కడిశుభము. అశుభమే?

దు॥ వ॥ (స్వగతము) యేమి. వీరిట్లాడెదరు? (ప్రకాశముగా) మిత్రులారా! కమ్మనైన కల్లుబావిలేదా. ఇదో త్రావుడు.

సీ॥ కల్లుదండిగత్రావి కైపుచేమీరియు।
సుదతులగూడుచే సుఖముజూడ।
అప్పుచేశియునైన అధికంబుగను తిని।
దేహంబుపెంచుటే దివ్యసుఖము।
సారాయికన్నను సారంపువస్తువు।
వెతకినదొరుకునే భూతలమెల్ల।
కంటికింపైనట్టి కాంతనుగనుగొన్న।
పొందుటకంటెనుఃపుణ్యమేది।

గీ॥ యిట్లుగాకను మరియు నింకెట్టులైన।
సుఖముగలదనుమాటలు జూటకల్ల।
స్వర్గమిందాను దుఃఖంబుదోపకున్న।
చచ్చుటయెముక్తియనియెశి సరణిగనుడి॥

వ॥ మిత్రులారా? సారవంతమైన సారాయితెండు. నేను త్రావి పిదపమీకొసంగెద.

మ॥ వ॥ (స్వగతము) అయ్యోవీనికి రాజాజ్ఞ తెలియకున్నదిగాబోలు. లేకుండిన యిట్టిమాటలాడడు. అయినవీనిదాడి పడరాదు. సారాయినొసంగిత్రావెదము. (ప్రకాశముగా) మహారాజా యిదిగో సారాయిత్రాగుము. [దుష్టసేనుడు మిత్రులు సారాయి త్రాగుదురు.]

ప॥ వ॥ మిత్రులారా సువాసితమైన సారాయిత్రాగితిరా. యిట్టిసా

రాయికల్లు రెండున్నరావి వేశ్యలయిండ్లకు జేరి రతిసుఖం బందుదము లెండు.

మి॥ వ॥ దుష్టసేనమహారాజా! మీయన్నయిచ్చిన యాజ్ఞదప్పించుకొని బ్రతికినగదా వారకాంతలజేరడము రతిసుఖం బందదము.

సు॥ వ॥ ఈదుష్టాత్ముడు నన్నెందుకొరకు శిక్షించుటకుప్రయత్నించినాడో వచింపుడు.

మి॥ వ॥ పురంబులోగలజనంబులు మనమాచరించేడు చెడుకార్యంబులు మీయన్నతో చెప్పుకొని కాపురంబులుమాని యేపురంబైనా జేరి బ్రతికెదమన్న, ధర్మపాలుండును మీయన్నఅయిన సత్యసేనమహారాజుగారు నిన్నును మమ్మునుబంధించి జన్మముండువరకు చెరసాలలోనుంచునట్లు నిశ్చయించినారు. ఇంకమనగతియెట్లున్నదో తెలియకున్నది.

సు॥ వ॥ అపురాయింతపనికి చాలిరా? వీరికేగతియూ మనోచూడుడు.

మ॥ వ॥ (స్వగతము) వారికేగతి లేదు గానియితనిగతిదుర్గతియే.

దుష్టసేనుడు - పాట - హైలాన్ - బ్యాగ్ రాగము - ఆదితాళము.

యేటికి యేటికియీమాటల్ మీ రెరుగరె
నాదగు సాహసము
వాటమైన నాయడిదము చేతనుమీాటెద
శిరములునింగిముట్ట॥ యేటికి॥
దుర్మదాంధుడౌ ధర్మపాలుశిరమర్మిలి
జనములు తల్లడమందగ
కరకరమని నాకరవాలముచే
శిరమునుతరిగెద బిరబిర॥ యేటికి॥

గీ॥ బంధురంబుగననుబట్టి బందికాన।
నుండ జేయగ నెంచిన యుర్వినాథు।
మంత్రియుతముగ నీరాత్రిమనముగోయి।

కంఠములు ద్రెంప నొప్పగు క్రౌర్య మొప్ప॥

వ॥ మదీయ సాహసంబెరుంగజాలక నన్ను బంధింపదలంచినంతనే కార్యంబు నెరవేరునా? ఈ రాత్రిపోయి వారిశిరంబులు కోసివైచుట కర్జంబని తోచుచున్నది. మీరు యేమిచెప్పెదరు వచింపుడు.

మి॥ వ॥ నీమాటకడ్డమా. నీయిష్టంబుకొలది గావింపుము.

దు॥ వ॥ ఇప్పుడు నాకొక యోచన తోచుచున్నది.

మి॥ వ॥ అదియెట్లు మాకెరింగింపుము.

దు॥ వ॥ మిత్రిసహితంబుగా సత్యసేనునిచంపి యతనిభార్యయైన సుశీలతోగూడి రాజ్యంబేల దలంచినాడ. ఇక్కార్యంబు త్వరలో గావింపవలయు. తీవ్రముగా వెళ్లుదము రండు.

మి॥ వ॥ (స్వగతము) అబ్బో వీనికి ముప్పుకాలముమూడినది. లేకున్న నిట్టిమాటలాడునా?

సుంకడు॥ వ॥ (జనాంతికముగా) సరే యొంకా వీనిమాటలు వింటివిగదా. పరమపతివ్రతయగు సుశీలనంట వీనికెట్లగును.

యెంకడు॥ వ॥ ఎట్లా? బలవంతముగా బట్టలేడా? అట్లనేగదా యీపురంబులోగల సుందరాంగనలను చెరిచినది నీకు తెలియదా?

దు॥ వ॥ ఏమీ? మీరాలోచించెదరు. యిక్కార్యమున భయము వేశినదా.

మి॥ వ॥ మాకేమిభయంబు లేదుగాని సంసారముజరుగుట కష్టముగా నున్నదని ఆలోచించుచుంటిమి.

దు॥ వ॥ ఆకష్టమేమి నాకు చెప్పుడు.

మి॥ వ॥ యేమికష్టము లేదుగాని బియ్యము లేవనియు అల్లునికి కూతురుకు కొత్తవస్త్రము లివ్వవలయుననియు మాయిండ్లాలు చెప్పిరి. అందుకు కొంతద్రవ్యము కావలశియున్నందుకు చింతిల్లెద మింతియే యింకేమియు లేదు.

దు॥ వ॥ అవురా! ఈసమయమునులో నావద్ద పైకములేదే. వీరి యిక్కట్టు ఈ హారంబునొసంగిన తీరునుగావ యిచ్చెద. మిత్రులారా ఈహారంబునుగైకొని విక్రియించి మీపనులుతీర్చుకొని పొద్దు గ్రుంకినతత్క్షణము రండు పొండు.

మి॥ వ॥ చిత్తము. మీమాటకడ్డమాడగలమా? నీయిష్టప్రకారము మంత్రిసహితంబుగా రాజునుచంపి రాజుభార్యనుగూడి రాజువైన ప్పుడు మాకేమి కొరతగల్లును యింక వెళ్లెదము.

దు॥ వ॥ మన మనుకున్న పని ఈరాత్రియే గావింపవలయును. పొండు మీకార్యంబులు తీర్చుకొని తీవ్రింబెరండు.

## రంగము 3

దుష్టసేనుడు ధర్మపాలుని తల దరిగిన యనంతరము.

అంతఃపురము - సత్యసేనుడు - అతనిభార్యసుశీల ప్రవేశించుచున్నారు.

(స్వగతము.)

పాట - మాండురాగము - ఆది.

శ్రీపరమేశ్వరా శ్రితజనపోషణ
యాపదబాపియు జూపుమునీకృప శ్రీపర॥
కలుషచిత్తుడు దుష్టసేనునికతనా
కలతయుగల్గెను తలపభూపశ్రిజక్షు శ్రీపర
సత్యమునకుభంగ మిత్తరిజేసియు
నెత్తెనుపగనాతో నీత్తరిబ్రోవవే శ్రీపర
దానవహరవీని దర్పముబాపి
ధారుణిధర్మమె నిలుపునిర్మలరూప శ్రీపర

రా॥ వ॥ హా పరమేశ్వరా నాకెన్నియిక్కట్లు సంభవించినను ధర్మ

లోపంబు గాగూడదని మనంబున సర్వదా గోరుచున్నాడు. ఇకా, కాలంబునకు ధర్మంబునకు భంగంబుగానంప దుర్మదాంధుండైన దుష్టసేనుడు ప్రజకనేక వుపద్రవంబులు జేయుచున్నాడు. అట్టిధర్మంబునకు భంగంబుగాకుండ యాగురాత్ము శిక్షించి నన్నుద్ధరించు భారంబు నీయదియని నెరనమ్మియున్నాను. నీకన్న రక్షించువారు లేరన్నా! శేషపర్యంకంబున విలసిల్లు భక్తప్రసన్నా! మాయన్న! నన్నేలుమా రమాపతి! (స్వగతము.)

సుశీల సీ॥ ఈమహారాజుదా నేలకోచింతిల్లి।
దిగులు చేనున్నాడు దీనవృత్తి।
ప్రజకేమిద్రోహముల్ కుజనులు జేసిరో।
మెరుగరాదాయెను యేర్పడంగ।
తల్లిదండ్రులభంగి దయతోడ ప్రజలను।
పుత్రులరీతిని బ్రోచువాడు।
సత్యంబుదప్పక నిత్యయశంబుగ।
నిద్ధరధర్మంబు నెరపువాడు।
గీ॥ నిట్టిమహనీయుడేటికో యిపుడుచూడ।
కలతబొందిన చిత్తానకలవరించె।
యేమికష్టంబుగల్గెనో నితనికిపుడు।
తెలియకున్నది తోపదుదిక్కునాకు॥

సు॥ వ॥ నాథా (ప్రకాశము) యేలయీరీతి నుల్లంబున దల్లడపాటుతో దిగులొందిన చందంబున నున్నవాడవు.

రా॥ వ॥ కాంతా యేమైననేమి నామనంబు పరవశంబై యేమియు దోపకున్నది వూరకుండుము.

సు॥ వ॥ అయ్యో యీమహాపురుషుని మంతనంబునకేదో గొప్పవిపత్తు మూడినట్లున్నది! ఇంకేమిసేతు హానాథా అదియేమో

నాకు తెల్పుడు వినియెద.

రా॥ వ॥ తెల్పునది యేమున్నది మనకు రుణంబు నీరెడి చందంబు చూపట్టె.

సు॥ వ॥ హానాథా యేమియిట్లాడెదరు.

రాజు - పాట - నాదనామక్రియ - రూపకము

కాంత నేనొక కలనుఁగంటిని యింతియిపు డేమనందు
దంతిగమననీకు నాకు దప్పె రుణము నేటితో కాంత॥
కుటిలకర్మ డొకడుతనదు చటులమైన ఖడ్గమూని
తటుకునమన ధర్మపాలు తలనునరికినట్టుగా కాంత॥
పుండరీకలోచనా నే కొండబిలముఁ జేరినట్టు
అండలేక కొడుకుబిడ్డయు అడవులందుదిరిగినట్టు కాంత॥

రా॥ వ॥ కాంతా యిట్టిదుష్టంబైన స్వప్నంబువాటిల్లె. ఈదుస్వప్న ఫలంబు యదార్థంబుగా మనకువాటిల్లునని తోచుచున్నది.

సు॥ మా॥ ప్రాణేశ్వరా యీస్వప్నఫలంబు మనకెట్లురాగలదు. అయిన పగటికల ఫలముపొందజేయదని లోకోక్తియున్నది గదా.

రా॥ వ॥ ప్రాణేశ్వరీ యేలయిట్లాడెదవు? ఆదికాలంబున సత్యహరిశ్చంద్రుడును నళుండునుపగలుగనిన స్వప్నంబురీతిగానే అనుభవించినట్లు పురాణంబులు చెప్పుచున్నవిగదా.

సు॥ వ॥ అయితె విధికృతంబుదప్పింప ధాతకైన వశంబుగాదన మనమెంతవారము? నీవు ధైర్యంబు వదలకుండుము.

రా॥ వ॥ ప్రాణసఖి నీవెన్ని చెప్పినను నామనంబు శాంతంబూనునట్లుగాన్పింపదయ్యె నీవూరకుండుము.

సు॥ వ॥ అయ్యోనాథా మీరీరీతివగలఁజెంది దిగులొందిన కాగలకార్యంబులు కాకమానునా ఈదిగులు చాలించి ఈశ్వరధ్యానంబు గావింతము లెమ్ముప్రాణపతి.

రా॥ వ॥ కాంతా కుటిలాత్ముండైన దుష్టసేనునితో భూప్రజకు మన కు యేమికీడు మూడునోయని చింతిల్లెద.

విజ॥ కం॥ దుష్టాత్ము దుష్టసేనుని
నష్టముగావించిప్రజకు నలమటదీర్తుం।
కష్టుల కలుషులవానికి।
నిష్టుల నందరినిగూల్చి యిపుడేవత్తుం॥

వి॥ వ॥ జనకా యేలయిట్లు చింతిల్లి వూరకుండెదు? నాకనుజ్ఞయొసం గిన నిమిషమాత్రములో యాకుటిలాత్ముల రూపుమాపెద. పంపుము.

రా॥ వ॥ కుమారా! ఆకులపాంసనుండైన దుష్టసేనుని జయింప ప సివాడవైన నీతోయగునా వూరకుండుము.

వి॥ గీ॥ దుష్టకష్టాత్ము దుర్మదద్రోహియైన।
దుష్టసేనుని మదమునుద్రుంపజేతు।
మదముచేమించు యేనుగమదముడింప।
చాలదే యంకుశంబును సన్నదైన॥

వి॥ వ॥ తండ్రీ నిమిషమాత్రంబున మిత్రయుతంబుగా గూల్చెద అనుజ్ఞయొసగి నన్నంపుము.

రా॥ గీ॥ వానిగూల్పంగ నేరికివశముగాదు।
పట్టుబోయినచిక్కడు పరమనీచు।
డేయుపాయంబులను జేయనెరిగివాడు।
చిక్కకున్నాడు క్షుద్రప్రసిద్ధులంది॥

రా॥ వ॥ అట్టికుటిలాత్ము నెవ్విధినైననే పట్టించి బంధిఖాన ప్రాప్తు గావించెద నూరకుండుము.

సు॥ వ॥ చిత్తము.

రా॥ వ॥ ప్రాణేశ్వరీ నాయొడలు పరవశంబై నిదురబూనినట్లు

మైకము కన్నులకుగప్పినది. నేనిల్వనోప. నిదురించెద. మీ
రును యీరాత్రి యూరక నిదురింపుడు.

సుశీల - రాజు సంవాదము - పాట - డైలాగ్ - జంఝూటి - ఆది

రాజు॥ సంశాయము నుదో చెసతి యేమొనా కుజూడ

చాలాగవామభుజము ఝడియాచునదరజొచ్చె సంశా॥

సుశీల॥ ప్రాణేశ వలదుచింత ప్రారబ్ధకర్మఫలము

ననుభావమెవరికైన విడువదుధరణిలోన ప్రాణేశ॥

రాజు॥ కాంతారోనేడు చూడు కన్నెమొయుడమదదరే

కలకంఠికష్టమేమో గల్గానుమనకుచాల సంశా॥

సుశీల॥ భక్తాలఁబ్రోచునట్టి భగవంతుకృప మనకుండా

యుక్తామే యిటులగుందా యో ప్రాణనాథతగదు ప్రాణేశ॥

సుశీల॥ వ॥ ప్రాణపతీ నీమనంబున చింతజాలించి నిదురింపుము.

రా॥ వ॥ సఖీమణీ నేనుపవ్వళించెద మీరును పవ్వళింపుడు.

దుష్టసేనుడు నతనిమిత్రులు మంత్రిని తలదనుగుకొని వచ్చుచున్నారు

(రంగమున మరియొక్కప్రక్క)

దుష్ట॥ వ॥ మిత్రులారా మనల పట్టదలంచిన దుష్టాత్ముండైన ధర్మ
పాలతల తరిగితిమిగదా యీకరవాలంబు గడుగుదము. జ
లంబులు తెండు.

(అని కడిగినట్లు నటించెదరు.)

మి॥ వ॥ యిదిగో నీళ్లు తెచ్చితిమి కడుగుము.

మ॥ వ॥ యింక పీనిపని మునిసినది. కలుషాత్ముడైన సత్యసేనుని పని
ముగింతెము.

మి॥ వ॥ అట్లనే కానిమ్ము.

దు॥ వ॥ యిదిగో అంతఃపురంబు ప్రవేశించితిమి చప్పుడుగాకుండ
రండు.

మి॥ వ॥ రాజుగారో రాణిగారో మేలుకొనియుండిన మనకపాయ

మానని తోచుచున్నది.

దు॥ వ॥ వొక్కవేళ మేల్కొనియుండిన నిద్రమైకముతో నుందురు, లేచుటకుముందే పనిముగించెద చూడుడు.

(దుష్టసేనుడు - మిత్రులు - రాజుతల్పమున కించుక దూరము నిలిచెదరు.)

దు॥ వ॥ మిత్రులారా! నాకిప్పుడొక యోచన తోచుచున్నది.

మి॥ వ॥ ఆయోచన యేదియో మాకెరిగింపుము.

దు॥ వ॥ ఈరాజు నిప్పుడు చంపుటమాని పుష్యమాసమున నాయిష్ట దేవతమైన కాళికాదేవికి బలియిచ్చిన యిష్టమైన వరంబులు యిచ్చునని తోచుచున్నది. అట్లుచేతము.

మి॥ వ॥ సరే అంతవరకు యితని నెచట నుంతము.

దు॥ వ॥ మనము రహస్యంబుగా అప్పుడప్పుడు నివసించెడు కొండబిలంబులోయుంచి బంధించి జలాహారంబులు బెట్టి మేపుచుందము.

మి॥ వ॥ నీయిష్టమట్లే గావింతము.

(మంచము యెత్తుకొని వెళ్లుదురు.)

[దుష్టసేనుడు సుశీలనుచూచి మోహావేశముతో]

పాట - చక్రవాకము - ఆది.

చూడానీచేడే సమానమైనసతి
నేడాయిజగంబునా
కూడెద దీనిని నేడీ యేవిధినైన
మానూనిగర్వముడుగా చూడా॥
అందామైన మోము చందూరుమించాను
చందంబు చూడగాను
డెందంబునిల్వాదు పొందకున్నమరుడు
తొందారజేసెనుహా చూడా॥

మృగరాజునడుమునాతో సరిమించిచూడగ
మగువా మాధ్యమునేదూ
మగువాకుమగడైన మగవానిదేజన్మం
జగమున చూడగాను చూడా॥

దు॥ వ॥ అవురా యీ కాంతామణితో సరిబోలు కాంత యింతవర
కెందునుఁ గానవయితి నింక నాలశ్యమెందుకు? దీనిఁబట్టి
కామోపభోగంబుల తృప్తినందెద. (అని పట్ట బోవును.)

సు॥ వ॥ హాపరమేశ్వరా! నాప్రాణేశుని తల్పంబుతోఁగూడ యేకుల
పాంసనుండో మటుమాయంబుజేసె. యీకుటిలకర్ముడెవడో
మదీయాంతఃపురంబులో చరింపుచున్నాడు. నెవ్విధి వీని
బారితప్పరాన. నీయాపద బాపిరక్షించు భారంబునీదేగదా!
హరీ! మురారీ! అఘవిదారీ! శౌరీ! ఈయాపద బాపి కడతే
ర్చుమా కంసారీ! శ్రీకృష్ణా రక్షింపుము రక్షింపుము.

పంచపాది॥ ఎన్నికష్టముల్వచ్చిన నీధరిత్రి।
ధర్మమార్గంబు రవ్వైన దప్పనట్టి।
సత్యసేనునిప్రియయంచు జగతిలోన।
ఖ్యాతిగాంచియు తుదకు నీఖలునిచేత।
నలతబొందంగ వ్రాసెనే నలువనుడుట॥

సు॥ వ॥ అయ్యో యిక్కుటిలకర్ముండు నా ప్రాణేశు నేమిజేసియు
న్నాడో యింక మమ్మేమి జేయదలంచినాడో తెలియదు.
యెట్టి దుష్టటంబైన యిక్కట్లు ప్రాప్తంబయ్యె! హరిహరీ
యీసమయంబున నీకన్న రక్షకులెవ్వరు కనుపించరైరి. ర
క్షింపుము! రక్షింపుము!

వి॥ వ॥ [నిద్రలేచి] అమ్మా మాజనకుండు తల్పసహితంబుగా లేడు
యెందుబోయె నాకెరిగింపుము.

సు॥ వ॥ కుమారా యిదియేమిమాయయో నేనును గాఢంబగు నిద్ర గూర్కుచుండ మీతండ్రిని యేకలుషాత్ములు గొనిపోయిరో యేమిఅపాయము జేసిరో నాకేమియు దిక్కుదోచకున్నది. ఇంకేమిజేయుదము.

వి॥ వ॥ తల్లి నీయుల్లంబున చింతిల్లక ధైర్యంబుపూనుము. విపత్తుకాలంబున అధైర్యంబుజెందిన కార్యంబు నెరవేరునా? యికార్యంబంతయు యీ కులపాంసనుండైన దుష్టసేనుని ప్రయత్నంబున జరిగినది. మించినపనికి వగచినతీరునా? యిక జరుగు కార్యంబునకుగదా యత్నంబు జేయవలసినది.

సు॥ వ॥ మనయత్నంబా కలుషాత్మునెదుట నేమిసాగును? యింకమనల నేమిజేయుదుమనో తెలియకున్నది.

వి॥ వ॥ అమ్మా విధికృతంబుదప్పింప మనతరంబా? యెట్టివారికైనను కష్టంబులు కర్మానుగుణ్యంబుగా ధాత్రియందు చూపట్టకపోవు. నీమనంబున శాంతిబూనుము. కుటిల కర్ముడును మజ్జనకద్రోహియునైన యాదుష్టసేనుని మిత్రసహితంబుగా హతంబు గావించి వచ్చెద. అనుజ్ఞయొసంగుము.

సు॥ వ॥ నందనా ఆకుటిలకర్ముని జయింప నీకగునా ఈశ్వరకృతంబెట్లున్నదో యూరకుండుము.

వి॥ వ॥ జననీ యానీచుండు నిన్నుగా మమ్ముగా బాధపరుప శరీరంబున ప్రాణవాయువులుండి యెట్లువోర్చి యుండనోపుదు.

సు॥ వ॥ ప్రియనందనా యిమ్ముదప్పిన సమయంబున క్రోధంబునకు మేరగాదు నీవూరకుండుము.

వి॥ గీ॥ తల్లిదండ్రుల కష్టంబు దలపకెవడు|
యుల్లమలరంగ దుష్కర్మయుతుడునగుచు|
కల్లకాయంబు తానస కలుషమతిని|
బ్రతుకజీవచ్ఛవంబగు పరగజగతి॥

వి॥ వ॥ మాతాపితలయందు దయమాలినయట్టి పుత్రుండున్న నేమి లేకున్న నేమి? సెలవిమ్ము. దుష్టసేనుని సంహారించి శీఘ్రంబె వచ్చెద.

సు॥ గీ॥ కోపమెవరికినుండుట గూడదండ్రు!
కోపమున ధర్మపదవికి గొరతగల్గు!
కోపియమపురి జేరంగ బోవునండ్రు।
కోపమునుమాని శాంతంబు గొనుముతండ్రి।

సు॥ వ॥ పరమపవిత్రులైన పాండుపుత్రులు కోపంబుబూనక యెట్టి కష్టంబులైన కుటిలాత్ములైన ధృతరాష్ట్రపుత్రులచే ననుభవించి తుదకు ఈశ్వరానుగ్రహంబున భారతాహవమందు శత్రుసేనల నుక్కడంచి జయంబునొందుట బురాణంబులు ఘోషింపుచున్నవి. వారి చందంబున కోపంబుమాని శాంతిఁబూని సమయము తటి నెరింగి శత్రులసంహారింతువు శాంతింపుము.

వి॥ గీ॥ ఉత్తమక్షత్రికులమున నుర్విబుట్టి।
కోపమునుమాన కార్యంబు గూడునెట్లు।

సు॥ గీ॥ పనులయెడ కోపముండెడు పగిదిజూపి।
అంతరంబున శాంతులై యలరవలయు॥

సు॥ వ॥ నందనా! కార్యంబుపట్ల బాహ్యమందు కోపంబుజూపినట్లు నటింపుచు శీతకరునిచందంబు అంతరంగబున శాంతంబుండ వలయుననియు అట్లుండినవారే ధాత్రియందెన్ని యిక్కట్లు ప్రాప్తించినను తుదకు ఈశ్వరానుగ్రహంబున కష్టంబులు నష్టంబుగావించి సృష్టియందు శాశ్వతయశఃకీర్తులు గాంతురనియు బుధులందురు గాననీవు నాచందంబున ప్రవర్తించి కీర్తి గాంచుము.

వి॥ వ॥ అమ్మా నీవు చెప్పినవిధంబున శాంతిపూని వూరకుండెద. మ

నకష్టంబులా పరమేశ్వరుండే నెరవేర్పగలండు జననీ.

విజయసేనుడు - విమల - పాట - నాదనామక్రియ - రూపకము.

యెట్టియాపద గల్గెమనకు యిట్టికష్ట మవనిలోనా
కట్టడీయె విధియుమమ్ము కఠినవృత్తి కుడువజేసె యెట్టి॥
ఈశ్వరా నీకన్నదిక్కు వెదుకయెవరు లేరుమాకు
విశ్వమందు ఖలులబాధయిపుడు బాపిబ్రోవవలయు యెట్టి॥
తల్లిదండ్రుల కష్టములు వెల్లవిధులదీర్పకాను
యుల్లమందుజూచుచూను యూరకుండవలసెనహా యెట్టి॥
ఆపదాహార పాపహరణా తాపసార్చితజూపునీకృప
పాపమతులకృత్యములు పరిహరింపుముమాతపితల యెట్టి॥

వి॥ వ॥ ఆపద్బాంధవా! అనాదిరక్షకా! ముకుందా! పరమానంద! గోవిందా! మమ్ముద్ధరింప నీయదేభారము. రక్షింపు మాదేవా.

(దుష్టసేనుడు తెరమరుగు నుండివచ్చి)

దుష్టసేనుని - పాట - డైలాగ్ - ఆది.

నీకృపనాపైన జూపుమిపుడుకామినీ
యోపజాల మరుడువిరి తూపులేశెహా నీకృ॥
యిందువదననీదుమోము నిపుడునెత్తియూ
నందముగనునన్నుజూడు నతివతాళనూ నీకృ॥
కామినీనీ మోవినొక్కి కమ్మవిల్తునీ
కేళిగూడుభాగ్యమిపుడు గల్గెనాకుహా నీకృ॥
నిక్కముగను బ్రింహానంద యాశ్రిమేశుడూ
మక్కువలర నిన్నుబ్రోవ మగువవిడువహా నీకృ॥

సీ॥ జలజాక్షినీమోము సరిగాకచంద్రుండు
కృష్ణపక్షంబున కృశతనొందె।

సుదతినీచెక్కుల సరిబోలకద్దముల్
రసహీనమగుచును పసయడంగె।
చెలియనీపాలిండ్ల సరిలేకవిరిచెండ్లు
కరముసోకినయంత కందిపోయె।
బోటినీనడుముతో సాటిగాకనుహరుల్
గురుతరోన్నతశైల గుహలదూరె।

గీ॥ కాంతనీదగుచూపుల కోటుపడియు।
మరుశరంబులు జలములమాటుపడియె।
గాననీదగుమేటి శృంగారమునకు।
సాటివచ్చెడుకాంత నెచ్చోటగాన॥

వ॥ జక్కవలఁ జుల్కఁజేయు నీమక్కువ చూడ్కులు నాపై బరపి నీకెమ్మోవి తావినొసంగి కమ్మవిల్తుకేళి ననుజేరిసుఖం బనుభవింపుము. ఈదిగులు చాలింపుము.

సు॥ వ॥ చెవులుమూసుకొని[స్వగతము]హరిహరీ! యీకుటిలాత్ముం డుకన్నుమిన్నుగానక నీతికిదూరుడై నన్నుబట్టదలంచుచున్నా డు. ఈ యిక్కట్టుబాపి నన్నురక్షించువారు లేరైరిగా?హాజ గద్రక్షకా! నీవేదిక్కని నమ్మినదాన రక్షింపుము! రక్షిం పుము.

దుష్టసేనుడు - సుశీల - సంవాదము - పాట - కల్యాణి - ఆది.

దు॥ యిందువదననీదు సుందారమగుమోము
అందముగనునెత్తి సుందరిననుజూడు యిందు॥

సు॥ మాయకల్పితమైన హేయమగుయీకాయ
మందున మోహముజెందవలదురన్న మాయ॥

దు॥ అన్నయనుచుపల్క అబలనీకునుచెల్ల
దెన్నివచించిన నిన్నువిడువనుజూడు యిందు॥

సు॥ చలమునపరధర్మ దూషడవయ్యె
ధర్మముకొండిగట్టి యున్నావి చెడనేల ధర్మమెరుగరన్న మా॥
దు॥ యిహపరములునాకు యిపుడులేవున చూడు
మెలనాగడయముంచి మేలుము యీవేళ యిందు॥
సు॥ ॥సీ రాణివాసమునకు రమణులయొద్దకు
పరపురుషులురాగ పాడియేర।
దు॥ రాణివాసమునాది రమణినాసామ్మిఫు
పరుడనేనెట్లాదు పద్మగంధి।
సు॥ అన్నభార్యగునన్ను కన్నుగానక పల్క
నోకెట్లులాడెరా యోరితులువ।
దు॥ అన్నకుభార్యవా నన్నుతాంగిరావిను
మట్లయినభార్యవే నాకుజూడ।
సు॥ గీ॥ యేమిరాపాపి యిటుపల్క నేమివరుస।
దు॥ ఎన్నసుగ్రీవుడునుగూడె నన్నభార్య।
సు॥ ఎలమియీవావి మనుజులకెట్టులౌర।
దు॥ అట్లుగాకున్న నిన్నునే నతివవిడువ॥
వ॥ సుందరీ యిట్టిమాటలచే కాలంబుగడపజూచిన నేనోర్చువా
డనుకాను బలిమినైననీతోడ సుఖింపకమానను చూడుము.
సు॥ బలవంతంబున పరకాంతల కామించిన కలుషాత్ముని యమ
లోకంబున యమునిభటులు కాలసూత్రంబులతో బంధించి య
ర్రిగగా గాచిన పుక్కపత్రిమతో నంటగట్టుచున్నారను నీ
తి నీవెరుంగలేదా? ఏల యిట్టికష్టంబు లనుభవింప బూనకు
ము. నామాటవిని నీతిమంతుల పథంబుబూని నడచి ధాత్రి
లో మనుము. గీర్తిగనుము.

దు॥ వ॥ కీర్త్యపకీర్తులకు, పాపంబుగీపంబునకు, నేనుభయపడువాడనుగాను. మామతంబున యేలోకంబులును లేవు. ఈలోకంబున సర్వ విషయభోగంబులనుభవించుటయే స్వర్గము. అట్టిసుఖంబు లేక రోగాదుల పరితపించుటయే దుఃఖము. పిదప చచ్చుటే ముక్తి. యిట్టిమాకు పాపమెక్కడిది.

సు॥ వ॥ (స్వగతము) అయ్యోవీడునాస్తికుడుగానున్నాడు. లేకున్నయి ట్టివిపరీతపు మాటలాడడు. ఈకుటిలాత్మునిచేతప్పగతి యే మియ్యగుదోచకున్నది. ఈశ్వరా? నీవేరతు (ప్రకాశముగా) అయ్యానాస్తికుండవై యేలచెడదలంచెదు. ఆస్తికబుద్ధిబూని పుణ్యమార్జింపుము.

దు॥ వ॥ అయ్యకొయ్య. ఆస్తిక మతావలంబులగు వారికే లోకలో లోకాంతర భ్రాంతులు? నాస్తికులైన మాకెక్కడివి. యి మ్మాటల కాలయాపనంబు జేయజూచుచున్నావు. బలిమి నైనా నిన్నుబట్టి నీతో సుఖింపక విడువనని యెఱుంగుము.

దు॥ సీ॥ తరుణినీపైనాకు తగులంబుమెండాయె
దయయుంచి నన్నేలు తలరుబోణి।
నీమోవిపానంబు నెలతనాకొసగియు
కమ్మవిల్తునికేళి గవయునన్ను।
సుందరపురుషుండ సుదతినీమోమెత్తి
నందంబుగనుజూడు మబలనన్ను।
నావంటిపురుషుండు నాతినీకబ్బుట
నీపూర్వపుణ్యమా నీరజాక్షి।
గీ॥ నెమ్మిననుగూడి మరుకేళి యెమ్మెలాడి।
రతుల సమ యుపరతులచె రమ్యముగను।
గూడియుందము ఆలస్యమేల యబల। /
మరుడు తొందరజేసెను మగువనన్ను॥

దుష్టసేనుడు - పాట - డైలాగ్ - మాండురాగము. సంవాదము.

నారీమణినన్నుకృప జూచియేలు మీావేళను
క్రూరవృత్తినరుడుయెద దూరనేసెవిరితూపును. నారీ
సు॥ ధర్మమునుమానియిటు కర్మమునువడిగట్టకు
నిర్మలులుపోవుపథ మర్మిలతోనడువుమన్న ధర్మ॥
దు॥ ధర్మమేనునీతోజేరి కూర్మిరతికేళిగూడే
కర్మమునునాకులేదు కాలమిటు జరుపనేల నారీ॥
సు॥ పాపాత్మకయేలయిటు వాపోవకు కూతలను
పాపినన్నిటులాడుట పాడిగాదు తులువవిను ధర్మ॥

వ॥ అన్నయ్యా పెద్దపులిగోర్లున్ను, లుబ్ధునిచేతి ద్రవ్యమున్ను, పతివ్రతయు రణశూరునిచేతి ఆయుధమున్ను, శరీరంబున ప్రాణంబులుండునంతకు పరులవశంబు గావను నీతియెఱుంగవా? పతివ్రతనైన నన్నుబట్టనీకెట్లగును.

దు॥ వ॥ ఎట్లా? బలవంతంబున బట్టిన యిక్కడన్నీకుదిక్కెవ్వరు.

దుష్టసేనుడు - సుశీల - సంవాదము.

సు॥ సీ॥ దిక్కులేరనీవు పెక్కులుప్రేలకు
దిక్కుశ్రీహరియుండు దీనులకును
దు॥ అట్టిశ్రీహరినీకు అండయైవచ్చిన
ఖండించియైన నిన్ పొందుదబల।
సు॥ బలపాశవితతిచే బంధించుశ్రీహరి
బంధింపనలవియే పాపకర్మ।
దు॥ పాపంబుగీపంబు పడతినాకును లేదు
నినుబొందపుణ్యమా నీరజాక్షి।
సు॥ గీ॥ పాపకర్ముండ ననుగూడ పాడిగాదు।
దు॥ పాడియేనిన్ను బలిమిచేపట్టగలను।
సు॥ అంటరాకురపాపాత్మ ఆవలుండు।

దు॥ అంటినినుబట్టి భోగింతు అతివవిడువ॥

దు॥ వ॥ కాంతా నేనెంత నిదానించినను నీమనంబు గరగకున్నది. మారుండు విరిశరంబులనాయురంబులగాడనేసి నన్ను బాధ పరచె. ఇంక నోర్చుటలేదు. నిన్నుబట్టి బలవంతంబుననైన కామునికి తృప్తియగునట్లు రతిసుఖంబు లనుభవించెద. నీ కడ్డమెవరో మొరవెట్టుకొనుము.

వి॥ వ॥ హా దీనబంధో! పరాత్పరా! పరమపతివ్రతయైన మాతల్లిని యీకుటిలకర్ముడు నోరుబట్టని మాటలచేత చెడుతలంపు జే యదలంచె. పాండవపత్నియైన ద్రౌపదిని అండజేరి దుష్టక ష్టాత్ముండైన దుస్ససేనుండు వలువవిడిచి మానభంగంబుజే యనెంచిన యక్కాంతారత్నంబు మానంబు రక్షింపంబూ ని అక్షయవలువ లొసంగిన లక్ష్మీపతీ యీకుటిలకర్ముని బారింబాపి మాతల్లిని రక్షింపుమాదేవ! పరాత్పరా! అ య్యో! మాతా! యిట్టివిపత్తునీకుగలిగె.ఆపద్బాంధవుండైన ముకుందుడు మరువక స్మరింపు. వీనిబారింబడక తరించెదు.

సు॥ వ॥ కుమారా నీవచించునట్లు పరమపురుషు భజించి మరుంగుప డియెద. మీగతియేమౌనో తెలియదుగదా.

వి॥ వ॥ అమ్మా మాపయింగల మోహంబు విజ్ఞానంబను శరంబు నగూల్చి యాపత్తు దప్పించుకొని నిన్ను రక్షించుకొనుము నీకుఅండయై రక్షించినపుండరీకాక్షుండే మమ్మును రక్షించు ను. మాపై తగులంబు మానుము.

విజయసేనుడు - సుశీల - సంవాదము - పాట - డైలాగ్

సు॥ రుణమిలదీరెను హాసుతమనకిపుడు

ఎన్నడునిన్నెడ బాయ-చిన్నియన్న నన్నుతాంగ రుణ॥

వి॥ తల్లిరోనీవిటులేలా తల్లడముంబడిచాలా

యుల్లంబుంచెదరంగా యీవిధిగుందగనేల తల్లి॥

సు॥ యేగతియీధరనినుబాసి
యెటువలెనిల్పుదుప్రాణములం రుణ॥

వి॥ మృతమని దెలియము యీదేహం
మోహంబిలబాయవె జననీ తల్లి॥

సు॥ విధికృతమీగతి నొదవెనుగా రుణ॥

వి॥ మోహంబిలబాయవె జననీ తల్లి॥

గీ॥ సకలవిషయంబులికిఁ జాలు చాలుననుచు।
విడిచినంతనె తనుఁగోరుచు విష్ణుమూర్తి।
యెనుచుశ్రుతిపల్కుచున్న దవార్యముగను।
యీమహాత్మ్యని వేడుమా యంబనీవు।

వి॥ విషయంబుల విదళించి పరమేశ్వరుని భజింపు. నిన్నురక్షించును జననీ. అయ్యో మాయాతనేల యీరీతి బాధంపెట్ట జూచెదు నీపాదంబులపైయింబడి వేడుచున్నారము. మాయందు కరుణించి మాతల్లిగా గాసిపెట్టుటమానుము.

దుష్టసేనుని పాట - బ్యాగ్ - ఆది.

ఛీఛీతులువా పలుకకురా
ఛీల్చెదమిమ్మా యడిదముచే
కొరచమైన యోచించక
నాయంచునజేరుట తగదుతగదు ఛీఛీ॥

సురనాథుండీవు డడ్డంబై
సారదినిమిమ్ములల బోరిచినను
కరకరమీదగు శిరములుగోశియు
యుర్వినిగూల్చెద యుడుగుడుగు ఛీఛీ॥

మీరీవిధినను బతిమాలి
కారుకారుమని యురచినను
కూరిమితోయీ నాతినిజేరి

మారునిగర్వము దూలగజేసెద ఛీఛీ॥

వ॥ మిత్రులారా! యీపిల్లలు నాకార్యంబునకు అడ్డంబువొచ్చుచున్నారు. వీరిని తొలగించుకొని పోండు.

మి॥ దుష్టసేన మహారాజా యికాంతామణి యెన్నియోరీతుల నీతుల జెప్పుచున్నది. ఈమెనువిడిచి యింక యన్యకాంతల గూడరాదా! పెద్దకరువులో చచ్చినంతమంచిని గుంపుజేసుకున్నావు. యీమెను వదలుము నామాటవినుము.

దు॥ మీరా నాకుబుద్ధులుచెప్పుట ఛీ అటులనుడు. ఈనీతులు విడువుడు.

సు౦॥ వరే యింకా యీపాపాత్ముండెంత ప్రార్థించినను ఈమెను విడుచునట్లు లేడు. మనమేమిసేయుదము.

య॥ ఏమిజేయున దేమున్నది. వీనిసహవాసము మానుదమన్న నీవువినవైతివి. యిప్పుడేమి సేయుదము. వీనిసహవాసంబున యీపతివ్రిత భంగపాటు మనముచూడవలసె.

సు౦॥ పాండవపత్నికి అండనై రక్షించిన పుండరీకాక్షుండే యీమెను రక్షింపగలడు. యింక యీమాటలు విన్నయెడల యీకుటిలాత్ముండు మనల చంపకమానడు. యీపిల్లవాండ్లను బంధించుకొని పోదమురమ్ము.

(అని పిల్లవాండ్లను బంధించెదరు.)

రంగము 4

---

సుశీల - హిందుస్తాని - జంఝూటి రూపకము.

దేవనాకు దిక్కులేదు దీననైతినీయెడా

కావవేనను కరుణతోడ కమలనయనశ్రీధరా దేవ॥

అండయెవ్వరులేరునాకు ఆదరించనూ

అండయగుచు నన్నుబ్రోవు పుండరీకలోచనా దేవ॥
కలుషమతిని వీడుగూయు కఠినమాటలూ
తలపగాను ములుకులాయె చెవులకీయెడా దేవ॥

వ॥ హాజగద్రక్షకా! విపన్నులకృప జూచిరక్షించెడు లక్ష్మీమనోహరా! నామనోవాక్కాయ కర్మంబులందు నాపురుషునికే మనంబొప్పించుదాననై యుండినదియథార్థంబైయున్న యీ పాపాత్మునిచే జిక్కకుండ యీపెట్టెయలో పరుండియుండెద. నానందనుండైన విజయసేనునికి మదీయభర్తకు వీరిద్దరికితప్ప తక్కినవారికి యీపెట్టెభేదింప నలవిగాకుండ వరంబొసంగి నన్నుద్ధరింపు మాదేవా.

[అని పెట్టెలోనకిపోయి మూత వేసుకొనును.]

దుష్టసేనుడు - పాట - మాందురాగము ఆది.

ఎందుపోయెనీ సుందరాంగినేడిందుజూడ
మాయమాయె నెందుడాగెనో ఎం॥
కుందరదనను కూడదలచిన
నిందుమాయమాయె డెందమేమోనిల్వదు ఎం॥
మదనుడిప్పుడు విరిశరంబులా
యెదనుగాడనేసె నిల్వజాలనారనే ఎం॥
యిందిరాక్షినీ ముకుందుడిప్పుడు
అందముగను డాగురించె నరయజాలను ఎం॥

వ॥కట్టడియైన యానలువయక్కలుకులాడినినా బారింబాపి తప్పించె. యీకొట్టిడిలో డాగియుండును. పోయిచూచి పట్టుకొని నాకోర్కె దీర్చుకొనియెద.

(లోనికిపోయి) ఏమీచిత్రము యిందునులేదు. దాచుకొనుటకు దావుయేమియుగానరాదయ్యె. యీపెట్టెలో నేమయిన దాచుకొని యున్నదేమో చూచెద. [అనిచూచు

ను ] (స్వగతం) అపురా యిదియేమి మాయయోగదా యీమూతరాకున్నది. పుక్కసాధనంబులతో చీల్పించెద. [ప్రకాశముగా] మిత్రులారా! యీపెట్టియను పగులగొట్టుడు. (కొట్టినట్టునటింతురు)

మి॥ వ॥ దుష్టసేనమహారాజా యెంతగొట్టినను యీపెట్టెపగులకున్నది. మా చేతులు కొట్టికొట్టి బొబ్బలుపోయినవి చూడుడు.

దు॥ వ॥ అట్లయిన యీపెట్టియను వుంచుట తగవుగాదు. శీఘ్రంబుగా సముద్రంబులో పారవైచిరండు! పొండు.

మి॥ వ॥ మంచిది అట్లేజేసెదము. (అని పెట్టియనెత్తుకొని పోవుదురు)

దు॥ వ॥ ఈసతీమణి నాబారింబడి చిక్కక తప్పించుకొనిపోయె. యింక నీమె పుత్రీపుత్రుల నుంచిన ముందు ముప్పునాకు వచ్చుంగాన, వీరిని అరణ్యంబుల కుతికెలుకోయునట్లు నియమించి పంపెద. వరేయంకా! వరేసుంకా! మీకొప్పించిన యీబాలబాలికలను. తోడ్కొనిపోయి అరణ్యంబున శిరంబులు నరికిరండు! తీవ్రమేపొండు! సుందాంగియైన వేశ్యయింటికి పోవుచున్నాను.

మి॥ మంచిది నీమాటకడ్డమా? పోయెదము.

సుం॥ వరే యంకా! వీడెట్టి పాపాత్ముండురా! మంత్రిసహితము సత్యసేను మహారాజుగారికి జంపి తనివిదీరక ఈ బాలులకజంప యాజ్ఞాపించెగదా. శివశివా యెంతకూరము.

యం॥ వ॥ వరేసుంకా యిట్టిమాటలచే కాలంబుగడిపిన యీకుటిలాత్ముడు మనల జంపనెంచును. మనకెందుకు ఈమాటలు? చెప్పిన పనిజేయుదము. వీనితో డబ్బురాబట్టుకొని జీవింతము.

సుం॥ వ॥ వరేయంకా అన్యాయధనమున బ్రతుకుటకంటే చచ్చుట మేలుగదరా? అన్యాయార్జితమైన ద్రవ్యము శాశ్వతమౌనేమో నీవేయోచింపుము.

యం॥ వ॥ పరేసుంకా అపునుఅన్యాయమే. యిక్కడ సత్యసేనమహా రాజుగారు వుంటేగా న్యాయమార్గము. వీడు పాపాత్ముడు. ఈమాటలెరింగిన మనలఁ జంపదలంచును. వీరినితోడ్కొనిపోవుదము రమ్ము విధికృతం బెట్లున్నదో యెవరికి తెలయును.

[అని తోడ్కొనిపోవుదురు.]

రంగము 5

ప్రవేశము. కట్టబడిన బాలురతో సుంకడు యంకడు.

యం॥ వ॥ పరేసుంకా యిక్కడ మానవసంచారంబులేదు. యిందు వీరి కుతికెలుకోసి పోవుదము.

సుం॥ వ॥ పరేయంకా శివశివా ఈపశికూనలజంప యెట్టివారికైన చేతులాడునా.

యం॥ వ॥ పరేసుంకా చంపకపిడిచితిమేని తిరిగి పూసజేసిన యాదుష్టసేనుడు తక్షణంబు మనల శిరంబులు ద్రుంచకమానడు. ఈదయ చాలించి వీరినిజంపుట యేమంచిది [అనిపూనుదురు]

విజయసేనుడు - విమల సంవాదము పాట - హిందుస్తాని

మమ్ము మీకృప యుంచిబ్రోవుడు మొ్రక్కెద మీకాళ్లకు
యిమ్మహిని మముజంపి బోయిననేమిలాభముగల్గును మ॥
మమ్ముఁగోలినపిల్లలను మీకిమ్మహిఁగలిగుండినా
సమ్మతినిమముజంప మీకునుచేతులెటువలెనాడును మ॥
తల్లితండ్రులు లేక మేమును తల్లడంబుననుండగా
యుల్లమలరగమమ్ము జంపుటయుచితమానే జూడుడీ మ॥

వి॥ వ॥ అయ్యలారా! మీకాళ్లపైబడి ప్రార్థించుచున్న మామొర యాలించిన మీమనంబులు నీరుగాకమానవు. మమ్మురక్షింపుడు.

సుం॥ వ॥ బాలులారా మీరెంత ప్రార్థించినను మా అంతరంగంబులు శాంతింపవు. ఈగాథలుమాని తలలువంచుడు. నరికెదము.

[వంచెదరు.]

వి॥ సీ॥ తల్లిదండ్రులబాసి తల్లడపడుమమ్ము
జంపమీకెటుచేతు లాడునయ్యా।

విమల॥ మావంటిబిడ్డలు మరిమీకుగలిగున్న
కఠినంబుజేతురా కావరయ్యా।

వి॥ పసిబాలురగుమమ్ము పలువరింపగజంప
మదికిమీకెట్లొప్పె మానరయ్యా।

విమల॥ మాపైనదయయుంచి మీపిల్లలుగనెంచి
కాచిరక్షించుట కార్యమయ్యా।

వి॥ గీ॥ దిక్కులేనట్టివారము తెలియరయ్యా।

విమల॥ మ్రొక్కెదము మమ్ము విడిచిమీ రరుగరయ్యా।

వి॥ మెంచగనుమాదు మొరల నాలించరయ్యా।

విమల॥ తల్లిదండ్రులు మీరని తలతుమయ్యా॥

వి॥ వ॥ అయ్యలారా! యేదిక్కులేక మీరేదిక్కని శరణని వేడుచున్న మాకభయ దానంబొసంగి పుణ్యంబొందుడు. మమ్ము విడుపుడు.

[ అని పాదములపై బడుదురు. ]

యం॥ వ॥ అయ్యో సుంకా యీపసివారిని జంపుటకు చెతులాడనే యేమి సేయుదము.

సుం॥ వ॥ నరేయంకా చంపక పోయిన మనకు బ్రతుకెక్కడిది,

యం॥ వ॥ నరేసుంకా మనము బ్రతుకకుండినా నాకిష్టమే వీరినివిడిచిపుత్తము.

సుం॥ వ॥ నరేయంకా నీయిష్టంబున్నచో వీరిని వదలుదము. వీరికున్న సొత్తుకైన తీసుకొనిపోవుదము.

యం॥వ॥ అయ్యో! నీకు సొత్తులపై ఆశపూనియున్నావు. వలదన్న కోపము జనించునేమో. సొత్తులుండుట వీరికే అపాయముగదా. లేకుండడమే మంచిది. తీసుకొని పోయెద. సుంకా నీ యిష్టప్రకారము సొత్తులు తీసుకొనుము. నాకుమాత్రము నేతులాకవు,

సుం॥వ॥ అయితే నీకు భాగములేదుగదా. నేనేతీసుకొనియెద.

యం॥వ॥ భాగంబుపై నాకిష్టంబులేదు. బాగ్రతగా తీసుకొనుము, పోవుదము.

[సొత్తులు తీసుకొనునట్లు నటిం తురు.]

యంకని పాట - హిందుస్తాని - ఝుఝూటి ఏకతాళము

అనుభవింపక తీరదు ప్రారబ్ధకర్మ అనుభవింపక తీరదు

అవనియెవరికైన విడువబోదు పూర్వకర్మ

అనుభవనీయంబుగాక హరిహరాది సురలకైన అను॥

ఆదివిష్ణు వవనియందు మానవత్వమొందెచూడ

భూతలమున భృగువొసంగు శాపకారణంబువలిలి అను

విషయములను జేరజనదు వెతలుముంచు నెవరికైన

వసుధలోన నలువ విషయవాంఛ తలనుగోలుపోడె అను॥

నాకమునకునాథుడైన పాకశాసనుండువిషయ

పోకడలను పోయిచెడడె ప్రాకటంబుగ దేహకాంతి అను॥

విషముజూడ దాప్రువాని వెసహరించునంతెకాని

విషయములనుకనులజూడ వెసహరించిభవముగుడుపు అను॥

వసుధబ్రహ్మానంద యోగ్యశమేశు కరుణలేక యున్న

విశదముగనుభవముదాటు వెసవులేదుయెవరికైన అను॥

వ॥ అయ్యో బాలులారా! విధి మీకిట్టికష్టంబు లొదవజేసె పూర్వకర్మ మెట్టివారికైన కుడువజేయక విడువదు. హరిశ్చంద్ర నలాది రాజన్యుల చందంబున ఈశ్వరానుగ్రహం

బు సంపాదించి మీకష్టంబులు నష్టంబులుగావించి సుఖించె దరు. అడవులందుండక యేదయిన నొకయూరుజేరి బ్రతు కుడు. మేముపోవుచున్నాము.

వి॥విమ॥ వందనంబులు పోయిరండు.

వి॥ వ॥ దానవభంజనా! భక్తమనోరంజనా! నిరంజనా! అనుదినం బు హృదయసదనంబున విజ్ఞానదీపంబుగా తేజరిల్లు నిన్నె రింగిన మునిజనంబుల విపద్దశలు నశియించుటేగాక ముక్తి యొసంగి బ్రోచుచున్నాడవు. ఈసమయంబున మాయాప దలు బాపిరక్షింపుము దేవా! దివ్యప్రభావా.

విమ॥ అన్నయ్యా ఈనిశీసమయంబున నేనడువంజాల ఇక్కడే ప రుండి వేకువనేదైన నొకగ్రామము జేరుదము.

వి॥ వ॥ అమ్మా సోదరీ మెల్లగనడువుము. ఇంక కొంతదూరముపో యి నిలుతము.

విజయసేనుడు విమల — సంవాదము — పాట.

విమల॥ నడువగజాలనన్న యీరాత్రినే నడువగజాలనన్న
నడువగజాలను తొడిబడెనడుగులు
నడురేయిసీపుడమీ అన్నయ్యా నడు॥

వి॥ సోదరియెంతటి కష్టములొదవెనె
మేదినిలోమనకూ వోచెల్లెలా సోద॥

విమ॥ తల్లిదండ్రిని యెల్లహితులబాసి
తల్లడపాటొదవె అన్నయ్యా నడు॥

వి॥ కష్టము మనకూ గల్గజేసెనే
కరుణలేకను దైవమూ వోసోదరీ సోద॥

విమ॥వ॥ అన్నయ్యా పూర్వభవంబున నేతల్లిపిల్లల కెడలుబాపియుం టిమో లేకున్న యిట్టిచిన్నతనంబులో యీదుష్టకష్టంబులు మనకుప్రాప్తించ వనితోచుచున్నది.

వి॥ అమ్మా అట్టిదోషంబు జేయకున్న మనకిట్టివిపత్తు ప్రాప్తించ దు. మించినకార్యంబునకు వగచిన లాభ మేమున్నది. గతజ లసేతుబంధనంబు నిరర్థకమేగదా. ఇంక జరుగునదికదా జూడవలసినది.

విమ॥ సోదరా యొడలుపరవశంబై నిదురవచ్చుచున్నది. ఇంకనడు వజాల. ఈవటవృక్షమూలం బాశ్రయంబుగా పరుండెద.

వి॥ హా దైవమా ఎట్టియాపద ఘటించె ఇక్కడమాయండ యై రక్షించువా రెవ్వరు. కృష్ణా నీవేదిక్కని నమ్మినారము. రక్షింపుము! సోదరీయిదిగో నాపంచెపరచెద. విశ్రమింపుము.

[అని పంచె పరచును.]

వి॥ సీ॥ హంసతూలికతల్ప మందుయింతులు జేరి
పవళింపజేసెడు పరమసాధ్వి!
యీయరణ్యంబులో నీరాళ్ల పైనను
నుండంగవలసెనే యుజ్వలాంగి!
సుకుమారియైననా సోదరికిటువంటి
కష్టమొదవునంచు గాంచనైతి!
తా జేయుకర్మకు తగినకష్టంబులు
అనుభవింపగవలసె నవనిలోన!

గీ॥ పరమశివుడెత్తె బిచ్చము పాడియనుచు!
విష్ణుదేవుండు యెరుకచే విడిచె తనువు!
కర్మమెవరిని విడువదు కట్టికుడువు!
మనమునను చింత వీడుట మంచిదరయ॥

వ॥ మించినపనికి యోచనజేయక ముందుకార్యంబునకు విమర్శ జేయుట మంచిది.

విజయసేనుని పాట – నాదనామక్రియ – రూపకము.

ఎంతకష్టముగల్గెనాదు యనుగుసోదరికిపుడుజూడ

దంతివరదకరుణయుంచి దయతోబ్రోవవే దనుజహరణా ఎం॥
హంసతూలికతల్పమందు అరయసిదురగూర్కు సోదరి
హింసలిటుల బొందవలసె విధియునేమందునహా ఎం॥
శరభశార్దూలమాది జంతుచయముగుహల వెడలి
శరధిఘోషము చందమొందిభయదముగనుసంచరించె ఎం
అండ యెవరు లేరుమాకు అడవులందు యిడుములొందనె
అండజేరిబ్రోవవేహరి పుండరీకనయనశౌరి ఎం॥

వ॥ అయ్యో ఈకీకారణ్యంబులో నానావిధంబులైన క్రూరమృగంబులు భయంకరంబైన రొదనుగావించుచు సంచరించుచున్నవి. పిశాచరాక్షసావళి ఘోరంబుగా నీయరణ్యాగారంబున కేకలిడుచున్నవి. నాసోదరి మైమరచి నిదురబోవుచున్నది. ఈమె నిదురతీరునంతకు యేమరక కాచుకొనియుండెద. విపన్నులైన మాపైన్ కృపబ్రోచి రక్షింపుమాదేవా.

[అని కూర్చుండును.]

(రాక్షసుని ప్రవేశము.)

రా॥ గీ॥ అహహ నాదైనవనమున నల్పులేక।
యుండనోపడు యెటువంటి దండియైన।
కండకొవ్వున వీడెవ్వడుండెజూతు।
ఖండనంబునగూల్తు నుద్దండవృత్తి।

వ॥ ఓహో నాబలంబును చలంబును చుల్కజేసి కన్నుగానక నావనంబున నిందుమది నున్నవాడు వీనిబట్టి దండియైన మదీయస్త్రంబులన్ జమరి వీనిపోకార్చి వీని మాంసఖండములిమ్ముగా భుజించెద. మృగమాంసంబుదిని వేసరియున్ననాకు మానవమాంసంబు నేటికిగదా ప్రాప్తము. హోహో యెంతచిత్రము.

వి॥ అయ్యో యవ్వఁడో కాటుకకొండ చందంబున నల్లనైన మే
నితో కొండబిలంబులు ప్రతిధ్వనులిడునట్లు భుజంబులప్ప
ళించుచు వనమృగంబులు పరువిడునట్లు ఘోరంబుగా కేకలి
డుచు వచ్చుచున్నాఁడు. యానీచాత్ము వాతబడకుండ భార
తాహవంబున నర్జుననండనుఁడైయె భండనంబున కురుసైన్యంబుల
చెండాడి జయంబుచేకూర్చిన చందంబున నందంబుగ నాకు
జయంబు చేకూర్చుమా రమాపతీ! అనాథుల రక్షించు ప
రమదాతా నీకు మ్రొక్కెద నతత్రాతా.

(అని ధైర్యంబున నిలిచియుండును.)

విజయసేన - రాక్షసుల - సంవాదము పాట - శామకల్యాణి - ఏకం

రాక్ష॥ యెవ్వఁడు యెవ్వఁడు యెవ్వఁడురా
నివ్వనభూమిలో నిటులుండా
క్రొవ్వానవ్వా చివ్వననిప్పుడు
బువ్వచందమున మ్రింగెదరా యెవ్వ॥

వి॥ ఇంగలమునుయిటు మ్రింగిన
యంతనె యట్లగునురా పాపాత్మా
భంగము య్యెదవు ఛీఛీపల్కకు
పారిపోక నివ్వు నిలునిలురా ఇంగ॥

రాక్ష॥ ననుభంగింపగ నలవేసుర
వరులందరు నీకును తోడైనా
పన్నుగనందరి బోకార్చెదనా
బాహుబలంబును మెరయగనూ యెవ్వ॥

వి॥ నిన్ను ననుబల మంతయునే
నొకనిమిషములోపల గూల్చెదనూ
నన్నెరుగక యిటు అరచెదు ఛీఛీ
నగుబాటయ్యెదు కూయకురా ఇంగ॥

రాక్ష॥ కూతలంచు నన్నేతవులెంచెదు
గూల్తును నిన్నీగదచేతా
భూతలమున నీతలిదండ్రులువిని
వాపోవుచునట మొరపెట్ట॥ మొవ్వ॥

వి॥ పిలుకుమార్చెదను జడరక నిలిచిన
భీమంబగు నాయసిదమునా
కలుషుడయమపురి యందున స్థిరముగ
కాపురముంచెద చూడుమురా ఇంగ॥

స॥ ప॥ వరేసిచా! ఈకరవాలంబుచే నీశిరంబునకికి యముపోలికి తీవ్రమేబంపెద. చూడు రాకుటిలా? అనికరవాలంబునకొట్టును.

[రాక్షసుడుపారిపోవును.]

విజయసేనుడు రాక్షసునివెంట నంటి తరుమునట్లు నటించును.

(విమల నిదరమేల్కొని భయముచే)

విమ॥సీ॥ అన్న! నన్నొంటిగా నడవిలోవ్రలడించి
యెందులకేగితో సన్నుతాంగ।
నిదుర నేబోవంగ సదయుడై యెవడైన
నిన్నేమిజేసెనో నెరుగనైతి।
తల్లితండ్రుల బాసి తలకుచునడవిలో
నుండగ దైవంబు నోర్వలేక।
అండలు బాపెనే హరిహరీ యెవ్వరి।
అండనైయెబ్రితు కుదీకొండలోన।
గీ॥ దిక్కుయేమియు దోచదు దీననైతి।
అక్కటా దైవమీవిధి నడలజేసె।
విధికృతంబున కొగచిన విడువదెవరి।
అనుభవింపకతీరునే యవనియందు॥

వ॥ అయ్యో ఈకికారణ్యమధ్యంబున నన్నొంటిగాజేసి మాయ న్నయేమయ్యెనో ఎందుబోయనో తెలియబాలకున్నది. పుం డరీకాక్షా భక్తజనరక్షా పాండవపత్నియైన ద్రౌపతియందఁ జేరి రక్షించినవిధంబున నన్ను రక్షింపుమాదేవా దివ్యప్రభావా.

[స్వగతం] యెవ్వరోవచ్చుచున్నారు అయయ్యాను మాయ చారంబు విచారించెద.

అంతలో చోరుని—ప్రవేశము.

పాట - బ్యాగ్ - ఏకతాళము.

ముంతమాయమ్మా నినుమరువలేనమ్మా
కల్లుముంతామాయమ్మా నినుమరువలేనమ్మా॥ కల్లు॥
చల్లపాలుపెరుగునీకు సాటిలేదమ్మా॥ కల్లు॥
తన్నులాటలాకునీవు తల్లివోయమ్మా
ఇంతచెడ్డతల్లివనినేనెరుగనోయమ్మా॥ కల్లు॥
మంగలసుబ్బన్నమాటమంచి దాయమదకిచూడ
చాకలసంజన్నమాట సంశయంబుతీరలేదు॥ ముంతా॥

పాట - గౌళ - ఆది.

మంచిబలిదొరకెను కాళమ్మకు
మెంచనాపుణ్యము ఈవేళకు॥ మంచి॥
కాళిహ్రీంకారి మాంకాళీయని
బాలికను బలిజేతుకాళమ్మకు॥ మంచి॥
కుంభంబుపోసి టెంకాయగొట్టి
అంబకునుబలిజేతు అబలనిపుడు మంచి॥
నరపశువుగోరి నేనరయంగను
పరమేశ్వరీకృప భాగ్యైను॥ మంచి॥

వ॥ అవురా కాళీదేవి మహిమ యేమందు! నరబలి పెట్టి యిష్టవరము సంపాదింపగోరుచున్న నాకు ఆడబోయిన తీర్థమెదురేగినట్లు ఈ బాలామణి నాకబ్బుట యా కాళీమహాదేవి కృపయే. వేరులేదు. ఈ బాలికను యెత్తుకొనిపోయెద. [అని దగ్గరకు పోయి.]

(చోరుడు విమలనుజూచి నవ్వుచు మెగుచుచుండినట్లు నటించును.)

విమ॥వ॥ అయ్యా మీరెవ్వరు? నేను దిక్కులేని పసిబాలను. తల్లిదండ్రులబాసి మాయన్నతోగూడి యీయరణ్యంబులో నడువనోపక నివురించుచున్న మాయన్న యెందుపోయెనో? యేమయ్యెనో నీవెరింగి యుండిన నాకెరింగించి కీర్తిగొనుము.

చో॥వ॥ [స్వగతము] ఈ బాల యెవ్వరైన నాకేమి కాళీమహాదేవికి మంచి బలిగానే అబ్బినది. మోసముచేశి యెత్తుకొనిపోయెద. (ప్రకాశముగా)

అమ్మా మీ అన్నయ్యను నొక రాక్షసుండెత్తుకొనిపోయె నీవుయిందున్న యాదుష్టాత్ముండు నిన్ను వినగలండు. నావెంటరమ్ము నాయింటికి దోడ్కొనిపోయెద.

విమ॥వ॥ అయ్యా తల్లిదండ్రులబాసి పిదప సోదరునెడబాసిన పాపాత్మురాల నైననేను ధాత్రిలో బ్రతికియున్న లాభమేమి. నేను మృతినొంది వారిజేరుటయే మేలుగానుండుగదా.

చో॥ వ॥ అమ్మా యేల యిట్టిమాటలాడెదు. తనంతనే అపాయంబు చేసుకొని ప్రాణంబులు బాసిన ఆత్మహత్యగావున అట్టివారు నరకముజేరుదు రందురు. ఇట్టిమాటలాడక నావెంటవచ్చిననిన్ను కొమార్తెవలెరక్షించెదను రమ్ము.

విమ॥ వ॥ (స్వగతం) అయ్యో విధికృత మెట్లవునో తెలియదు. ఈశ్వరానుగ్రహంబున్న తల్లియో తండ్రియో నాకబ్బకపోదురా? చూతము. అయ్యా నేనడువనోప తెల్లవారిన వెంటనే పోవు

దము తాళము.

చా॥ వ॥ అమ్మా! తడవుచేసిన మీఅన్ననుమెత్తుకొనిపోయిన రాక్షసుడు రాగలడు. వాడురాకమునుపే నిన్నెత్తుకొని బోయెదరమ్మా.

(విజయసేనుడు రాక్షసుని తరిమివచ్చుట.)

వ॥ అయ్యో ఈక్రూరుండగు రాక్షసుండు నాబారిఁబడి పారిపోయె. యింకవీనిజోలిమాని నాసహోదరియగు విమలయేమయినదియో వేగంబునబోయిచూచెద.

[చూచి సోదరిని గానక గట్టిగాపిలుచును.]

వ॥ అయ్యో ఈస్థలంబున నాచెల్లెలు లేదే! యేమయియుండునో తెలియదుకదా! పిలిచిచూచెద. అమ్మా విమలా విమలా యెటికేగితివో యేమిగతినైతివో హా!సహోదరీ తల్లిదండ్రులబాసినను మనమిరువురము నొకరికొకరు ధైర్యంబు జెప్పుకొని బ్రతుకుచుండ తుదకు దైవమునిన్ను బాయజేసెనె? చెల్లెలా! చెల్లెలా! ఇంకేగతినాకు. శరీరంబున ప్రాణంబు లెట్లునిలుపుదు. హాదేవా జగద్రక్షకా! ఆపద్బాంధవా! నా సోదరి యెందుబోయినదో తెలియజాలక విలపించునన్ను రక్షింపుము, రక్షింపుము.

విజయసేనుని పాట - డైలాగ్ - నీలాంబరి - ఆది

సోదారిరుణముతీరెనా విధిజూడనోర్వక యిట్లుజేయు॥ సో॥
గతభవమున దోషమిటులగట్టి కుడువజేసెనుబహువెతల॥సో॥
యేమృగములవాతబడితో నన్ను యేమారు పిలుచుచునడవి॥
కరిరక్షకునికరుణలేకా మనకుధరణిపైనెడబాటులొందవే॥ సో॥

వ॥ అయ్యోదైవమా!మాయందురవ్వంతైన దయలేక మాతాపితలనెడబాటుగల్గించి తుదకు ఈకీకారణ్యములో నాసోదరియుతంబుగా కలుసుకొనియుండి యొకరికొకరు ధైర్యం

బుజెప్పకొని యుండనీక నాప్రియసోదరియైన విమలాదేవి నెడబాయునట్లు గావించితే హా శ్రీపతే! ఇంక ఈమేనప్రాణంబులు భరించి బ్రతికియుండుటకన్న ఈ యసిదంబున నురంబుజీల్చుకొని తల్లిదండ్రిసోదరి పోయినగతికిఁ బోగలవాడ. అవసానకాలంబున నిన్ను స్మరించువారికి పాపంబులునశించి నీదివ్యపదముగల్గునట్టి దేవా! రక్షింపుము. రక్షింపుము. అని విజయసేనుడు ఆయుధంబుచే నురముబొడుచుకొనునట్లు నటించుట.

ప్రవేశము—శ్రీమహావిష్ణువు.

పాట - తోడి - ఆది.

చాల్ చాల్ యీ తెగువ చాలించుమా మది
బాలించుమా బాలుడ యీపనిబూనకయుడుగుము
మేలునుబొందెదవు చాల్ మేలునుపొందెదవు॥ చాల్॥
కష్టపుకార్యము నిట్టులజేయఁగ నెట్లొదవెనుమదినీ
బాలక నెట్లొదవెనుమదినీ॥ చాల్॥

సీ॥ ప్రాయోపవేశమా పనిబూనకిప్పుడు।
ముందుమేలందెద వందముగను।
నీహత్యచేసికు నేలాభమును లేదు।
ఇందునదోషమే పొందునిన్ను।
సుగుణివిసుమతివి సుస్థిరమతివినీ।
కిట్టికార్యముమది నెట్టులొదవె।
నామాటవినినీవు నికముందునడువుము।
నవ్యసుఖమబ్బునవసనీకు।

గీ॥ పూర్వకర్మంబు నెవరిని పోదువిడిచి।
గతభవంబున దోషమీగతిఘటించె।

నన్ను స్మరియించు కతమున నన్ని బాసి।
విడువు ఈ తెగువేటికి విమలచరిత॥

వ॥ విజయసేనా ఇట్టికష్టమైనపనిమాని నేజెప్పెడుచందంబున నందంబుగ నడచెదవేని యశస్సుఖంబులుగల్గు. ఇదిగో నారాయణ అష్టాక్షరిమంత్రింబుపదేశించెద. నీమనంబున ననయంబు ధ్యానంబుగావించుచు ఈప్రాయోపవేశంబు చాలించుకొనిరా.

విజయసేనుడు పాట - డైలాగ్ - శాహన - ఆది

శ్రీధర నీసరిదైవములేదుర శ్రీధరనీసరిదైవములేదుర॥ శ్రీధ॥

మేదినిభక్తుల గాధలుమాన్పను శ్రితజనపోషా
చిన్మయరూపా॥ శ్రీధ॥

ధృవప్రహ్లాదుల ధృవముగ నేలిన ప్రవిమలరూపా
భక్తకలాపా॥ శ్రీధ॥

వందితమునిజన నందితనీపద కంజములాన
మదిపొందుగగొల్చెద॥ శ్రీధ॥

సీ॥ నీమహామహిమంబు నెంచినుతింపను।
నేనెంతవాడనునీరజాక్ష।
బాలుండజడుడను ప్రజ్ఞహీనుండనర।
కాచిరక్షింపవేకమలనాభ।
భవబంధరహితనిన్ ప్రవిమలమతిగొల్చు।
భక్తులపాలిటి భాగ్యముండురి।
మానులునేవేళ మదిగరగంగజేసి।
నిన్నుధ్యానింతురు సన్నుతాంగ।

గీ॥ తప్పులన్నియులోగొని ఒప్పుగాను।
తప్పలన్నియుధరలోన దీర్చిబ్రోవు।
అప్పనీకన్న దిక్కునాకెవరులేరు।

కావవేనన్ను ఈవేళ కమలనాథ॥

వ॥ భక్తజనకల్పద్రుమా, ముక్తిరూపా, నామొరయాలించి నన్ను రక్షింపనే తెంచిన పుణ్యరూపా, నాయపరాధంబులు జేకొని మన్నించి బ్రోవుమా మంగళప్రదా.

విష్ణు॥వ॥ బాలా యీపాపోపవేశంబైన తెగువచాలించి నీయిష్టంబైన వరంబువేడు మొసంగెద.

విజయసేనునిపాట - డైలాగ్ - హిందుస్థాని - ముఖారి - ఆది.

భక్తవరదా-భవవిదూర ముక్తిదాతా-మునికులావన
రక్తిగుణములబాపి ననునీ భక్తునిగ-దయబ్రోవవలయు ॥భ॥
నిన్నుగన్నామాన్యులాకు యెన్నసున్న భవముధరలో
నన్నుతామరనందితా-నావిన్నపమునినిబ్రోవుదేవా॥ భక్త॥
సుమతులూనినుమనమునందు సుస్థిరంబుగదలచుచుండ
వెతలబాపుచువారిహృదయామందు-నుందువ్రాపొందుగాను॥

వ॥ ముక్తిప్రదాతవైననీదర్శనంబొసంగి వరంబువేడుమని నన్ను వచింపదలంచెదరు. వరంబుప్రసాదింప నీకిష్టంబేని కామంబులేనివరంబొసంగుము.

విష్ణు॥వ॥ ఆదికాలంబున ప్రహ్లాదుండు గోరినట్టు నీవుగోరితివిగాన నందుకై నేసంతోషించితి. భూలోకంబున నన్నుభజింపుచు విషయంబులపారబడక మదీయభక్తసహవాసంబునకా జేసి కీర్తిప్రతిష్ఠలు భూలోకంబున నెరపి అంత్యంబునమదీయపదంబు నొందెదు. యిందుకునతీదూరంపున పుళిందగ్రామంబు జేరుము. రాజ్యంబుచేకూరుటయేగాక నీతలిదండ్రులు నీసోదరీమణియైనవిమలవిపద్దశలన్నియుమదీయకృపతోనసించి వారు నిన్నుకా జేరగలరు. ఈ తెగువచాలించిపొమ్ము. నేనెంతర్హితుండయ్యెద కుమారా. [అని నిష్క్రమించును.]

విజ॥ వ॥ (స్వగతము) హాపరమేశ్వరా నీకృపయెంతని కొనియా

డంగలవాడ. దీనబంధో దయానిధే, హరిహరీ, కంసాంతకా, నీవు చెప్పినచొప్పున పులిందజేరితి. ఈపురిరాజమార్గంబు నంబోయి పురంబునీక్షించెద.

విజయసేనుడు - పాట - డైలాగ్ - శాహాన - ఏకతాళము.

ఔరా ఈపురంబుసొబగు అందమొదవె మదికినేడు
సురపురంబుసాటయిన చూడనొప్పుధరను నేడు॥ ఔరా॥
హాటకమణిమయాదీప్తి కోటకారజూడనేడు
మేటియైనభూధరముల మించివెల్గుగోపురములు! ఔరా॥
స్ఫటికదీప్తిహర్మ్యములును స్వర్ణసాలుస్తంభములును
పటుతరంబుగమించు పురోధ్యానవనముఔరజూడ॥ ఔరా॥
అందముగనుబరిహర్మ్యనంద యాశ్రిమేశుడైనరమా
మందిరునకు నిలయమనగమహిని వెల్గుచున్నదార॥ ఔరా॥

గీ॥ భూపతెవ్వడు ఈపురిబ్రోచువాడు।
శ్రీపతీకృపపరిజలకు శ్రేయమొసగి।
అనుదినంబును బ్రోచెడునవనిపతిని।
జూడవేడుకబొడమును నేజూడబోదు॥

వ॥ ఏమిా ఈసభాస్థానంబుగావించిన జనశూన్యంబుగా చూపట్టుచున్నది. సమిాపించి పోయివిచారించెద.

పరివేశము—కీర్తిపాలుడు.

పాట - డైలాగ్ - బ్యాండు - ఏకతాళము.

ఈబాలుడెవ్వడో యిపుడుజూడగా
గేలసేయువదనకాంతి ఇందుమండలం॥ ఈబా॥
చూట్కులలరెనూ వేడ్కమిారగా
చూడనితనిదేహకాంతినేడు ఈధరా॥ ఈబా॥
ఇట్టిబాలుడూ మాధాత్రిపతికిని

పుట్టియున్న పట్టణముగట్టియుందుము॥ ఈబా॥

వ॥ ఈబాలుఁబోలు సుకుమారుండైన నందనుండు మాకేనికు
న్నపట్టంబుగట్టియుందుముగదా? అట్టిపుణ్యంబు మాకులేక
పోయినది. ఈవచ్చెడుబాలుఁగాంచిన బాలభానునిచందం
బున ముఖంబున కళలుతాండవమాడుచున్నవి. ఈశ్వరా
ఈబాలునిచేనైనబంధించియుండు యిండ్లువాకిండ్లు తెరువంబ
డుచందంబుగావించి అరాజకంబైన ప్రజలయొక్క క్షేమంబు
చూడుము. ఈరాజకుమారుడెవడో దేశప్రభువుగానిర్మింపుము.

విజ॥ వ॥ అమ్మా ఈపురంబును పాలించుభూపతియెక్కడ? నతనియా
స్థాన మంటపమేది. చూపింపుము.

కీర్తి॥ వ॥ అయ్యా మీరెవ్వరు తల్లిదండ్రులెందుందురు. ఈపురం
బునకెందునిమిత్తమురుదెంచితిరో ఎచింపుము.

విజ॥ గీ॥ సత్యసేనుండుమాతండ్రి నిత్యయశుడు।
సుగుణిమాతల్లిసుశీలసి జగతినెగడె।
యట్టివారికిపుత్రుండ నరయపేరు।
విజయసేనుండనందు్రు నఁసశ్వమందు॥

వ॥ అట్టినేను పూర్వకర్మవశంబున మాతాపితలంబాసి అరణ్య
మార్గంబున సోదరీసహితంబుగా వచ్చుచున్న విధియోర్వం
జాలక నెడబాటొదవించిన ఈశ్వరానుగ్రహంబున ఈపురం
బుచేరవచ్చినాడ. నినుఁజూడ నీనత్వము వదనంబునఁ తో
చుచున్నది. ఎందునిమిత్తమో యెఱిగింపుము.

కీర్తి॥ గీ॥ మాపభుండును నిట మూడుమాసములకు।
ముందువేంచేసెపరమున కందముగను।
పోవునప్పుడువాకిండ్లు పొసగమూసె।
ధరణిపతియౌనువాకిండ్లు తెఱచువాడు॥

వ॥ అనిమారేడునియమించిపోయిన భూమండలంబున రాజులెం

దరోవచ్చి తెరువఁజూచిరిగాని వాకిండ్లురావయ్యె. ఇంక మాకు కీర్తిశాలియైన ధర్మప్రభులభింపడని చింతిల్లెదము.

విజ॥ వ॥ అందుకా! నేనుతీసిచూతునా?

కీర్తి॥ వ॥ చూడుము.

విజ॥ వ॥ హాశంకరీప్రియా! కింకరజనంబులరక్షించు పంకజాక్షా! నీయాజ్ఞచొప్పున ఈపురంబుజేరినాడ. వీరిమనంబుల సంతోషముగల్గునట్లు నీకరుణారసంబున వాకిండ్లుతెరవఁబడుగాత.

(అనివాకిండ్లుతెరుచును.)

కీర్తి॥ కం॥ దండముభూవరనీకును।
దండముహేమాద్రిధైర్య. ధర్మస్వభావా।
దండమునీకిదె జేతుము।
నిండుమదిఁబ్రోవ నీవెయీపురిప్రజలఁ॥

వ॥ మహాత్మా యిష్టదేవతయే నీరూపముగావచ్చి ఈవాకిండ్లు తెరువఁబడె లేకున్న మానవులకు శక్యమా?

విజ॥ వ॥ అదియెందుకు?

కీర్తి॥ వ॥ మారేడు శాంతదాంతాది గుణసంపాదనంజేసి తపస్త్యాదమంబుల సత్యంబుదప్పక సత్యయశంబున రాజ్యంబేలుచుండి శరీరంబుబాసి పరంబునకుబోవునప్పుడు బంధురంబుగ వాకిండ్లు బంధించి నన్నుఁబోలు సుగుణంబులుగలవానికి వాకిండ్లు తెరువంబడునట్టివానికి పట్టంబుగట్టుమని సెలవిచ్చియుండెఁగాన మాకోర్కెనెరవేరె. పట్టంబుగట్టుకొని రాజ్యంబుపూజ్యంబుగా నేలుము.

విజ॥ వ॥ మీయిష్టంబుచొప్పున కానిండు.

కీర్తి॥ కం॥ పూజ్యంబుగ నీరాజ్యము।
త్యాజ్యముగాకుండశిరిసుతేజంబెసగఁ।
పూజ్యముగా రాజ్యమేలుము।

సుజ్వలముగకీర్తి యశమునుర్విఁ నెగడఁ॥

( అనిపట్టముగట్టుటకు ప్రయత్నించి పూలహారము వేయుదురు.)

విజ॥ గీ॥ ధర్మమెప్పుడు మీాపలదప్పకుండ।

యశముకీర్తియులాభంబు హెచ్చుచుండ।

లోభగుణముకు మనమును లోగకుండ।

అండయైపూజనీయుండు హరియునుండు॥

విజ॥ వ॥ ప్రజలారా! మీామనంబుల లక్ష్మీపతిని భజింపుచుండుడు.

పోండు.

[అందరు నిష్క్రమింతురు ]



శ్రీ ర స్తు.

# విజయసేనమహారాజునాటకము.



## ద్వితీయాంకము.

### రంగము 1

ప్రవేశము—బెస్తవాండ్లు.

పాట - కేదారగౌళ - జంపెతాళము.

దండాముదండాము గంగమ్మరో
దయతోడమముబ్రోవు గంగమ్మరో॥ దండా॥
మంగళప్రదమైన మాతల్లిరో
మమ్మేలుమొక్కెదము మాయమ్మరో॥ దండా॥
చాపలనుబట్టగా చనుచున్నాము
కాపాడిబ్రోవవే గంగమ్మరో॥ దండా॥
టెంకాయిబోనము గంగనీకు
చేకానుము తెచ్చితిమి తెంపుతోడా॥ దండా॥

రాము॥వ॥వరేవరేవుచ్చలసోముగా! ఈదినము మనలజలంబుల మునుగకుండ రక్షించుచున్నగంగమ్మకు యిదో టెంకాయి, బోనము పోగునూలు, దచ్చన, సమర్పించి వరంబుపుచ్చుకొని సముద్రముపై యాటకుపోదాములెమ్ము.

సోము॥వ॥అట్లేపోదాముగాని మనగంగమ్మకు బోనముపెట్టడమునరే టెంకాయగొట్టడమునరే. పోగునూలు యెందుకురా వేయడము. వచింపుము.

రాము॥వ॥వరేవుత్తనాయాలా. గచ్చుకూతలుకూయడమేగాని అర్థము

రవ్వంతైన తెలియకపోయినదే.

సోము॥వ॥ అన్నియును తెలియునుగాని అదియేమో యెంతచూచినా తెలియ లేదురా?

రాము॥వ॥ నీవట్లానాయాండ్లకా అవి తెలిసేది.

సోము॥వ॥ నీకుయెట్లా తెలిసెరా?

రాము॥వ॥ మాగురువులవారివల్ల నాకు తెలిసినదిరా?

సోము॥వ॥ అట్లయితే ఈమాట జెప్పుటకుమాత్రము నిన్ను నేగురువుగా నెంచెద. చెప్పుము.

రాము॥వ॥ ఓహో పూరికేనా.

సోము॥వ॥ యింకెట్లురా.

రాము॥వ॥ గురుదక్షిణలేనిదే చెప్పుటసరికాదు.

సోము॥వ॥ [స్వగతము]ఈనాయాలు నాతో డబ్బురాబట్టదలచినాడు ఇప్పటికిదక్షిణపెట్టి ఈయర్థము నెరింగినపిమ్మటదక్షిణంత రెండింతలురాగుంజుతాలే! [ప్రకాశముగా]యిదిగో గురుదక్షిణ చెప్పుము.

రాము॥వ॥ అట్లయితేనా కాళ్లకు మొ్రొక్కుము.

సోము॥వ॥ [స్వగతము]అబ్బో! యీడు మెల్లగనే క్రిందికినీళ్లు తెచ్చువా నిగానున్నాడు. కానిమ్ము యీఅర్థమెరిగినపిదపజూతము. అని మ్రొక్కును.

రాము॥వ॥ తనువుధనమనంబులు గురువులవారికి త్రికరణశుద్ధిగా నొసంగవలయు. అట్లుజేయుము.

సోము॥వ॥ (స్వగతం) అబ్బోవీడు మెల్లమెల్లగనే తొలుత దక్షిణయిమ్మని పిదప తనువుధనము మనము యిమ్మనుచున్నాడు. యింక రోంస్సేపటికి పెండ్లాన్ని యిమ్మంటాడేమో? అట్లడిగితె నెత్తిన బండవేశి సావదెంగిపోతాలే చూతము. (ప్రకాశముగా) నీమాటకు బదులా! అట్లేసమర్పించెద.

రాము॥వ॥ అమ్మవారు ఆదికాలంబున మాయారచన చమత్కృతి

తో జీవజాలంబు గల్పించి మోహాంబను పాశంబుచే సర్వజీ
వుల బంధించినది నీకు తెలియదా.

సోము॥వ॥ అవును. పెద్దవాండ్లు చెప్పుకొనుచుండ వినియున్నాను. యి
ప్పుడు అమ్మవారిమెడకు నూలుపోగులెందుకు. పూలహార
ములు లేవా.

రాము॥వ॥ అట్లుగాదు. భక్తాదులు ఆదిలో మాకొసంగిన మోహాంబ
నుపాశంబు మాపూజలంగీకరించి మమ్మును గ్రహించి మా
మోహపాశంబులు త్రెంచి నీవే గైకొమ్మనునట్లు మనపెద్దవా
రు మర్మముగా అర్థము తెలియ జేయుచున్నారు. నీవేమను
కొన్నావు.

సోము॥వ॥ నేనేమనుకోవడము తెలిసిందిగా. యింక దక్షిణమర్మము
జెప్పుము.

రాము॥వ॥ ధనముపై తగులంబు లేకుండ దయచేయుమని ఈదక్షిణ
సమర్పించడము.

సోము॥వ॥ యింక తెలిసినది. గంగమ్మకు టెంకాయిబోనము సమర్పిం
చి యాటపోదాము లెమ్ము.

రాము॥వ॥ అట్లాయితె తీవ్రమే గానిమ్ము.

(అని వలలువేసి యాట ఆడుదురు.)

రాము॥వ॥ వరే మనయిరువురివలలో యేమిపడియుండినా సరిగ పం
చుకొందము.

సోము॥వ॥ యెవరొద్దన్నారు అట్లేకానిమ్ము.

[అని వలలు యీడ్తురు.]

సోము॥వ॥ వరే నావలకు బలమైన చాపతగిలినది. నాకు కదలకయు
న్నది. నీవురమ్ము గుంజుదము.

రాము॥వ॥ యిదిగో వచ్చుచున్నాను.

[ అని ఈడ్చి]

సోము॥వ॥ వరే చాపకాదు. యేదియో గొప్పపెట్టెగాయున్నది. చూడుము.

రాము॥వ॥ చూచితి. ఈ పెట్టెలో యేమున్నను యిద్దరము సరిగా పంచుకుందాము.

సోము॥వ॥ అట్లైందుకు చాపలై తేగదా పంచుకొనునట్లు మనయేర్పాటు.

రాము॥వ॥ లేదులేదు. మరచినావు యేమిపడినగానిగద మనమొదట యేర్పాటు.

సోము॥వ॥ వరే ఈపెట్టెనుమాత్రము నీకుయివ్వడములేదు.

[అని సోముడు పెట్టెను యెత్తుబోవును.]

రాము॥వ॥ వరే నాకు భాగముపంచక పెట్టెనునిన్నెత్తనిచ్చుట లేదు.

(అని మెడలు కర్చుకొనునట్లు నటింతురు.)

రాము॥వ॥ మీాసముదువ్వుచు నాకుభాగము ఎగరవేశి తన్నిపోవుచున్నాడవా. తెలిసె. సర్కారు వారికిచెప్పి నీపని ముగించెద చూడుము.

సోము॥వ॥ అయితేనేమి? నాకేమిచేస్తారో చూచెదలే.

రాము॥వ॥ చూతువు చూతువులే. (స్వగతం) యిప్పుడు తీవ్రమెపోయి షావుకారైన కామిశెట్టి గోవిందప్పగారికి ఈసంగతి నెరింగించి ఫిర్యాదిచేయుంచెద. వీనిపని ముగించెద. మనషావుకారికి పరసోత్తంటె బెల్లముతిన్నట్లే. యికార్యము చేయక మానడు. పోయెద. (అని నిష్క్రమించును.)

## రంగము 2

---

(కామిశెట్టి గోవిందప్ప గుమాస్తా చలపతిరావు ప్రవేశం)

శెట్టి॥ వ॥ చలపతిరావుగారూ సిలుకుజమ సరిచూచితిరా.

చల॥ వ॥ సరిచూచితి యేమిసిలుకు మిగలలేదు. సరిపోయినది.

శెట్టి॥ వ॥ నీతో యెప్పడు యిదేగోడేనా. మనకైతులువచ్చి సరుకు లుతీయునప్పడు బంగారుదింతని బంగార సమంధమింతని యిట్లనే ప్రతిదానికి సమంధము కలిపివ్రాస్తే యెందుకు సిలుకు మిగులదు. యిదివరనుంచి నట్లేచేయుము.

చల॥ వ॥ చిత్తము. నీయిష్టప్రకారము యిదివరనుంచిఅట్లేగావించెద. [స్వగతం] ఈసిచుణికి పరసొత్తంటె బెల్లముతిన్నట్లే వీసి, గోలుచుట మానుకుంటామన్న కుటుంబపోషణ జరుగుట భారము. యింకా కొంతకాలము చూచెద.

ప్రవేశము—రాముడు.

రాము॥ వ॥ దండములు దండములు శెట్టిగారు.

శెట్టి॥ వ॥ [స్వగతం] యిట్లా దరిద్రులే యెప్పడుచూచినా కొంపచుట్టు తిరిగితిరిగి అప్పుయివ్వమని మాతాడు తెంచెదరు. (ప్రకాశముగా)వరేదండము గింజము అట్లుండని యెందుకు వచ్చినావో చెప్పుము. నాకుపనివున్నది పోవలె.

రాము॥ వ॥ దుడ్డు గింజలు అడుగరాలేదు. మీకు మేలుచేయనెంచి వొచ్చినాడ.

శెట్టి॥ వ॥ యేమిమేలు నీపాడు! యేమిమేలు నీవుచేసేది. కూటికిగుడ్డకులేని పరమదరిద్రుడునీవా నాకు మేలుచేయుడము.

రాము॥ వ॥ కోపముమాని శాంతింపుడు. నాకునువుచ్చలసామిగానికిని సముద్రములో వొకపెట్టె చిక్కినది.

శెట్టి॥ వ॥ అయితే నన్నేమి శేయమనియెదవు.

రాము॥ వ॥ నాకు భాగముయివ్వక నన్నుతన్ని వాడువొకడే ఆపెట్టె లోగల సామాగ్రి ఆక్రమించినాడు. సదరుపెట్టె నాదని నీవు ఫిర్యాది చేయుము. నీపక్షముగా నేను సాక్ష్యము చెప్పచున్నాను.

శెట్టి॥వ॥ అయితెనిజమా? నీమాటలునమ్మిఫిర్యాదిచేయుదునా? మాటతప్పవుగదా.

రాము॥వ॥ మాగంగమ్మతోడు నమ్మి శీఘ్రమే ఫిర్యాదిచేయుము. ఆలస్యమైన పెట్టెలో వస్తువులు తీయును.

శెట్టి॥వ॥ చలపతిరావుగారు మనరామన్నకు తాంబూలము తెచ్చియిమ్ము. రామన్న యిట్లురమ్ము. ఈకంబడీపైన కూర్చొనుము. నీభార్యపిల్లలు బాగున్నారా.

రాము॥వ॥ వస్తువిస్తులతో దరిద్ర కాపురంబులో యేమిబాగులే. అదే బాగు.

శెట్టి॥వ॥ చలపతిరావుగారూ మనరామన్నకు వకమూట సన్నబియ్యము పంపుము.

చల॥వ॥ చిత్తము అట్లేపంపుచున్నాను. యితనిపేర ఖర్చువ్రాతునా.

శెట్టి॥వ॥ ఛీ బుద్ధిమాలినకూతలే. మనఖర్చులో జేర్చుము. రామన్నగారూ ఈపంచలు తీసుకొనుము. పిల్లవాండ్లకు అంగీలు నీభార్యకు చీరెలు యిచ్చుచున్నాను. యిప్పటికి బియ్యాము మూట ఎత్తుకొనిపొమ్ము. సాక్ష్యము దైవసత్యముగా పెట్టె నాదని చెప్పవలయును.

రాము॥వ॥నీపిల్లలతోడు యీపెట్టె నీదనియే సాక్ష్యముజెప్పెద.నమ్ముమని చేతిలోచేయి బెట్టును.

శెట్టి॥వ॥ అట్లయిననేను అర్జీవ్రాసుకొనిపోయి పోలీసువారికియివ్వడమేగాక తక్షణమే వాసియింట్లు జప్తిజేయించి పెట్టెను పోలీసువారి స్వాధీనములో వుంచివచ్చెద. నీవుపొమ్ము.

[అని అర్జీవ్రాశినట్లు నటించును.]

రంగము 3

---

పోలీసు ఇన్సుస్పెక్టరు గృహము.

ఇన్స్పెక్టరు కుర్చీమీద కూర్చొనియుండును. గోవిందప్ప శెట్టి అర్జీచేతబట్టుకొని ప్రవేసించి అర్జీని పోలీసు ఇన్స్పెక్టరుగారికి యిచ్చును. పోలీసుఇన్స్పెక్టరు దానిని తీసుకొని చదువును.

"మహారాజరాజశ్రీ పోలీసు ఇన్స్పెక్టరుగారి దివ్యసన్నిధికి. కామిశెట్టి గోవిందప్ప శెట్టిగారు దండములుపెట్టి వ్రాసుకున్న మనవి యేమనంటే. మాగ్రామము పుచ్చలసోముగాడు మా యింటిలో రాత్రి పదకొండుగంటల కాలములో ప్రవేసించి సొత్తులున్నపెట్టె యెత్తుకొని పోయినాడు. గనుక వానియిం డ్లు జప్తీచేయించి సదరుపెట్టెనామాస్వాధీనములో వుంచుకొం దురని ప్రార్థన. చిత్తగించ కర్తలు".

సాక్షులు (గచ్చులరాముడు సాక్షి నిశానిగుర్తు)

పోలీ॥వ॥ గోవిందప్పగారు యింకమీరుపొండు. రేపు వుదయం వచ్చె దము.

శెట్టి॥వ॥ అట్లు శెలవుదయచేయక తీవ్రమే పోదామురండు.

పోలీ॥వ॥ సకొడుకులా! స్వవుచెప్పినట్లు రాను.పోపో.

శెట్టి॥వ॥ అయ్యా ఈనూరురూపాయలునోటుతీసుకొనుడు. జప్తీచేసిన వెంటనే యింకొకనూరు రూపాయలు యిత్తును. తీవ్రమేద యచేయుడు. (అని తొందరగా నటించును.)

పోలీ॥వ॥ అట్లయితే పోదాము. జప్తిచేసినవెంటనే తలిమ్మానూరు ర పాయలు యివ్వవలయును. లేకున్న తప్పు కేసులోనికి అప్రు వరుగా తీసుకొని నీకు శిక్షవిధించెదను

శెట్టి॥వ॥ మీఆజ్ఞ. అట్లేకానిండు! తీవ్రముగారండు.

(అప్పుడు పోలీసువారు పుచ్చలసోమునియిండ్లు జప్తిచేశి పెట్టెను ర జుదగ్గరకు తీసుకొనిపోవునట్లు నటింతురు.)

## రంగము 4

రాజదర్బార్

కీర్తిపాలుడు విజయసేనుడు ప్రవేశము.

పాట - జైలాగ్ - బ్యాగ్ - రాగము ఏకతాళము

విజ॥ కీర్తిపాలకా సుకీర్తిగల్గియూ
మిత్రులాతోగలసిసుఖమె యూకునెప్పుడు కీర్తి॥

కీర్తి॥ కుజనశిక్షకా విజయసేననీ
కరుణకల్గ కొరతమాకు గలదెధీమణీ కుజ॥

విజ॥ విహితకర్మముల్ విమలబుద్ధిచే
మోహమూదిఫలము కోర్క్యమాని జేతురా కీర్తి॥

కీర్తి॥ భక్తిచేతనూ భగవంతుప్రీతిగా
సక్తిలేకవిహితకర్మ జేయుచుందుము కుజ॥

విజ॥ గీ॥ మంత్రిశేఖరమన రాష్ట్రమందుజనులు।
వింతలేమియులేకను విమలబుద్ధి।
అంతరంగంబు విషయాది చింతలుడిగి।
చింత జేతురె శ్రీహరి చిత్తమందు॥

వ॥ కీర్తిపాలా మదీయ భుజాబలంబునకు లోనైన రాష్ట్రజనంబులందరు సత్కీర్తి మించునట్లుగా శ్రీహరి పదపంకజంబులు నుతిజేయుచు మతిహీనులయెడ దయజూపుచు సత్పథంబున నడుచుచు సుఖమేగదా.

కీర్తి॥ గీ॥ ధర్మకార్యంబుసకుహాని దగలకుండ।
నిర్మలంబుగ రాజ్యంబు నేలుచుండ।
ప్రజలకేమియు లోపముల్ పడకయుండ।
నీవుమాకెల్లనండమై నిలచియుండ॥

వ॥ సత్యశౌచ దానదయాది మొదలగు సుగుణంబులకు నికిరమైన నీవుపాలింప మాకేమికొరతయుకలేక అందరును సుఖమే.

విజ॥ సీ॥ పూర్వపుణ్యముచేత పుట్టినకాయంబు
నిట్టలంబునవ్యర్థ పెట్టనేల।
పురుషార్థసిద్ధికై భూమిలోపుట్టిన
సార్థకజన్మంబు జరుపనేల।
ధర్మంబుఘటయించి నిర్మలమతితోడ
కర్మంబులనుమవి గాల్పవలయు।
నిత్యంబుశ్రీహరి నెడబాటులేకుండ
మంతనంబునచింత మగుపవలయు।
గీ॥ విషయజాలంబులను బుద్ధివిడువవలయు।
కోపకోపంబు దూరంబు గూల్పవలయు।
మసలకను మంచిగుణములు మరుపవలయు।
విషయజనములతో పొందు విడువవలయు॥

వ॥ కీర్తిపాలా! బుద్ధి పొరపాటులేకుండ కార్యంబులయందు శ్రద్ధగల్గి వర్తిల్లుము.

కీర్తి॥ వ॥ నాయత్నమున్నంతలో పొరబడకుండ వర్తింపగలవాడ. పొరబాటొదవినప్పుడు పుత్రుల తండ్రివలె పోషింపుము.

విజ॥ వ॥ కీర్తిపాలా! కామిశెట్టి గోవిందప్పశెట్టి యింటిలో పెట్టెను పుచ్చులసోముగాడు దొంగలించినాడని పోలీసుకేసొకటి వొచ్చివుండెను. దానిని ఈదినము తీర్పుజేయుదము. భటునకు ఆజ్ఞయిమ్ము.

కీర్తి॥ వ॥ చిత్తము.

వ॥ దఫేదారునిజూచి వాది ప్రతివాదులు సాక్షులు వకీళ్లు వచ్చినారా పిలువుము.

దఫే॥ వ॥ మురారిరావుగారు మురారిరావుగారు మురారిరావుగారు.
అని పిలుచును.

ఒక కాగితము చేతబట్టుకొని మురారిరావు ప్రవేశించును.

మురా॥వ॥ ఓహో వొచ్చితిని.

దఫే॥ వ॥ మీరువారు వచ్చినారా.

విజ॥ వ॥ యేమండీ మురారిరావుగారు కూర్చొనుడు.

మురా॥వ॥ గచ్చలరాముని పక్షముగా నేను వకాల్తానామా పుచ్చుకున్నాను. యిదే వకాల్తానామా. [అని యిచ్చును.]

శెట్టి॥ వ॥ [జనాంతికముగా] గచ్చలరామా సాక్ష్యముతప్పేవు. కా గుగానాపక్షము చెప్పరు. యింక రె  రాటల బియ్యము యెత్తుకొని పోవుదువులే.

రాము॥వ॥ విజయసేనుణి న్యాయముఅన్యాయము పరిసీలనలో భగవంతుని సాయమున్నదని ప్రజలమూలముగా వినియున్నాను. మనము వ్రానుకున్నది అన్యాయముగనుక నాగతి నీ గతియెట్లో తెలియకున్నది.

శెట్టి॥ వ॥ చేతులు పిసుకుకుంటూ. అయ్యో యింకెట్లు యింకెట్లు. గచ్చలరామా అన్యాయము అన్యాయము.

రాము॥వ॥ అన్యాయమని యిప్పుడా నీకు తెలిసినది.

శెట్టి॥ వ॥ అయ్యో ఏమిరా యిన్నా యిట్లాడెదవు.

రాము॥వ॥ యెట్లాడడ మేమున్నది. నీ త్రాళ్లు నిన్నే బంధించినవి. మొదట అంగడితావుకువస్తె మాతాళ్లు తెంచేది యిట్లాదరిద్రములే అని నన్ను తిట్టితివి. మేము త్రెంచడ మెందుకు? నీ తాళ్లు నిన్నే బంధించునులే. రాజ్యముతీర్పులో.

శెట్టి॥వ॥ చలపతిరావుగారూ. ఈదగిడీకొడుకు రెండుమూటలు సన్న బియ్యము దొబ్బితిని యిప్పుడు సాక్ష్యము పల్కనట్లు తోచుచున్నది. యేమి సేయుదము. అయ్యో యేమి చేయుదము

చల॥ వ॥ యిపుడానేయునది. వీధిలో నూదిచిక్కిన యింటిలో దబ్బళము పోవునను నీతితప్పునా. అన్యాయము వద్దని నేనె తజెప్పినవినక పరసొత్తంతే బెల్లముతిన్నట్లే? అన్యాయార్జితమంతయు యిపుడు గ్రిక్కించక భగవంతుడుంచునా.

శెట్టి॥ వ॥ ఇట్టిమాటలతో పనియేమి? యిప్పుడు గచ్చులరాముడు సాక్ష్యము సరిగాచెప్పునట్లు దోచదు. యెట్లు చేయుదము.

చల॥ వ॥ చెప్పునదియేమి? లచ్చుమక్కతోగదా సర్వపనులు. లంచమిమ్ము. యిదిగదా సమయము తప్పదుసాక్షులకు న్యాయహీనులగు వకీళ్లకు, ప్రభుప్రులకు. శీఘ్రముగా లంచమిమ్ము లోపలపోయి మాట్లాడగూడదు.

శెట్టి॥ వ॥ వానిని విచారింపుము. యెంతలంచ మియ్యవలయునో.

చల॥ వ॥ గచ్చులరామా సాక్ష్యము తప్పక మాపక్షముగా చెప్పుము. నీకు నూరురూపాయలు యిచ్చునట్లు జేసెద.

గంగ॥ వ॥ అవితీసుకొనిపోయి యెగవతిరుపతి వెంకటేశ్వరస్వామి దగ్గెరగరుడస్తంభములో వేయమనుము. ఫూరికెఆవలపొమ్ము. బుద్ధిచెప్పెదను.

చల॥ వ॥ యింక యెన్నియో నీవేఅడుగుము.

రాము॥ వ॥ యెన్నియా! వకీలు నాకంటెజాస్తి యేమి చేస్తాడు. అతగాని ఫీజంత యిస్తెగా నేనుపలికేది.

చల॥ వ॥ ఏమీ? అయిదునూర్లా! వోయబ్బో గోవిందప్పశెట్టి కొంపగూలె. నీకు అయిదునూర్లు, వకీలుకు అయిదునూర్లు. పోలీసువారికి అయిదునూర్లు. వెరశి పదహైదునూర్లు. అన్యాయముగా గూర్చినధనము. ఇంతకన్న యెక్కువవుండదు. తక్కువగనే వుండును. అన్యాయార్జిత మెందుకుండును.

శెట్టి॥ వ॥ అయ్యో! చలపతిరావుగారు. వాడొప్పియున్నాడా.

చల॥ వ॥ వో వొప్పినాడు అయిదునూర్లకు.

శెట్టి॥వ॥ అయ్యో అంతా కొంపగూలె యింకేమివున్నది.

చల॥వ॥ అంతోయింతో లేకుంటే రొవ్వంతలో నీకు శిక్షఅయ్యేది.

శెట్టి॥వ॥ అయ్యో? యెట్లన్నా. పోనీలె యిదిగో ఈనోట్లు వానికిమ్ము.

చల॥వ॥ ఇదిగో గచ్చులరామా యిదిగో ఈఅయిదునూర్లు రూపాయలు తీసుకొనుము. మాపక్షముగా సాక్ష్యము సరిగాంచెప్పవలెను.

రాము॥వ॥ వూ॥ మనమాటకేమురా! అయ్యగారికి యినపకడియాలే. యేవిరూపాయలు తెమ్ము.

చల॥వ॥ యివిగో తీసుకొనుము.

(రూపాయలు తీసుకొనునట్లు గచ్చులరాముడు నటించును.)

రాము॥వ॥ యింకవూరుకో మనమాటలువినిన ప్రభువుగారితోమాట వచ్చాది. (అని వూరకుందురు.)

ఇన్సు॥వ॥ ఇన్సుస్పెక్టరు పెట్టెతోనహితము మోయించుకొని వుచ్చలసోమునితో వొచ్చిచేరి దండమర్పించి కూర్చుండును.

[గోవిందప్పశెట్టివచ్చి ఇన్సుస్పెక్టరు పక్కగానిలుచును.]

విజ॥ వ॥ సాక్షులు అందరు వచ్చియున్నారా.

ఇన్సు॥వ॥ అందరు వొచ్చియున్నారు.

విజ॥ వ॥ గోవిందప్ప శెట్టిగారూ నీయింటిలో వుచ్చలసోముడు ఎన్ని ఘంటల కాలములో పెట్టెదొంగలించుకొని పోయియున్నాడు. నిజముచెప్పుము.

ఇన్సు॥వ॥ శెట్టినిచూచివుచ్చలసోముడు దొంగలించినసంగతిజెప్పుము.

దఫే॥వ॥ (స్వగతం) యిట్లానాయాండ్లే లంచాలుపట్టి న్యాయఅన్యాయమని మనంబున నిసుమంతైన యోచింపక డబ్బుదొరికిన చాలు అన్యాయమైన న్యాయముగా మార్తురు. యిట్లానాయాండ్లే మరుజన్మంబున పాయకాండ్లవుట్చేది. ఈఅన్యాయవునాయాండ్లభవిష్యతఈదినము బయల్పడక మానదు.

శెట్టి॥వ॥ మొన్నటిదినము రాత్రియో అర్ధరాత్రియో అంతకులోపలనో పుచ్చలసోముడు నాయింటిలో ప్రవేశించి సొత్తులున్న పెట్టెను దొంగలించుకొని పోవుచుండెను.

మురా॥వ॥ అప్పుడు నీవు మేల్కొన్నావా.

శెట్టి॥వ॥ నేను మేలుకొనియుండిన నాయింటిలోనికి దొంగయెట్లు ప్రవేశించును. వీడు తొందరగా పోవునపుడు పెట్టె తటాలున వాకిలికితగిలి శబ్దముఅయినందున మెలకువ వచ్చినది.

మురా॥వ॥ మెలకువ వచ్చినతర్వాత యేమిచేశినావు.

శెట్టి॥వ॥ పెట్టెను చూచుకున్నాను.

మురా॥వ॥ లేచినవెంటనే పెట్టెనుచూచుటకు కారణమేమి.

ఇన్సు॥వ॥ కారణమేమని అడిగెదవేల. సర్తకులకుతనుసొత్తుపైన మిక్కిలి అనురాగము అని మీకు తెలియదా. అందువల్ల నిద్ర లేచిన వెంటనే పెట్టెను చూచియుండవచ్చును.

విజ॥ వ॥ తర్వాత యేమిజేసినావు.

శెట్టి॥వ॥ బజారునకువచ్చి చూచునంతలో పెట్టెను యెత్తుకొని పుచ్చల సోమన్న పోవుచుండెను.

మురా॥వ॥ బంధురంబైన అంధకారమున సోమన్నయని నీవెట్లుగుర్తించినావు.

శెట్టి॥వ॥ అంధకారమెందుకు? మునిసిపల్ లాందర్ల వెల్తురుయున్నది గుర్తించుటకు.

మురా॥వ॥ దూరముగా వెళ్లుచున్న మనిష్యుని గుర్తించుట వీలుయే లాగుండును.

శెట్టి॥వ॥ పార్విద్రుడు పదిసార్లు నాకొంపచుట్టు తిరిగిబతిమాలి అప్పుగా కూటికి గుడ్డలకు ధాన్యము ద్రవ్యము తీసుకొని పోవువాసని ఎందుకు గుర్తించలేను.

ఇన్సు॥వ॥ అవును అట్టిలావాదేవిగల మనిష్యుని మైలుదూరముండినైన

ను గుర్తించవచ్చును.

మురా॥వ॥ యిట్టిలాలునేర్పించి అన్యాయమైన కార్యమును న్యాయముగా నెన్నజూడకు. న్యాయమునైన బుద్ధినిలుపుము. అన్యాయమున కొడిగట్టక డబ్బునైన ఆశమానుము.

ఇస్స॥వ॥ ఈమహాపురుషునకు దుష్టునై ఆశయేలేదు. యేలయిట్టి మాటలాడెదు దుష్టునైన ఆశలేకున్న వకాల్తాగా యెందుకు వచ్చియుందువు.

విజ॥ వ॥ అయ్యలారా! ఎందుకుమీరు వివాదపడియెదరు. పూరకయుండుడు.

శెట్టిగారూ శెట్టినెత్తిన యెత్తుకొనిపోవుచున్న వుచ్చలసొముని గుర్తించి యేమంటివి.

శెట్టి॥వ॥ అయ్యో! సామన్న సామన్నయని పిలుచుచూపోవుచుండవాడు రాయి విసరివేశిన నానొసటతగిలి గాయమైనది చూడుము. యీఘాతమైన గాయము అగునట్లు దెబ్బతిని నామనమున వుప్పాపిరివున్న వుప్పుఅమ్ముకొని బ్రతుకనవచ్చునని యోచించి ఈసంగతి గచ్చులరామునితో చెప్పకొని దుఃఖించుచు అప్పుడేపోయి పోలీసువారివద్దకేగి ఫిర్యాదిచేసి జప్తీచేయించగా మాలుదొరికినది చూడుడు.

మురా॥వ॥ నీయింటిలోనున్న పెట్టెను తీసుకొని పోవునపుడు సదరు పెట్టె నీదేనని చూచినట్టు సాక్ష్యమెవ్వరైన వున్నారా

శెట్టి॥వ॥ వున్నారు.

మురా॥వ॥ ఎవ్వరు.

శెట్టి॥వ॥ గచ్చులరాముడు.

విజ॥ వ॥ సదరుసాక్షిని పిలువుడు.

దఫే॥ వ॥ గచ్చులరామా! గచ్చులరామా! అని నాలుగుసార్లు పిలుచును.

గచ్చులరాముడు నడిము గట్టుకొని చెదరిబెదరి చూచుచు దండముదేవరా అని ప్రవేసించును.

దవే॥వ॥ రాజువిచారించు రూములోనికిపొమ్ము. అన్యాయపునాయాండ్ల సంగతిఅంత విశదముకాగలదు.

రాము॥వ॥ తెలిశేదేముంది. మాశెట్టిగారికి నాకు జెయిలుప్రాప్తము వుంటేవుంది యింతేగదా. యింకేమున్నది.

దవే॥వ॥ సరేపొమ్మని నూకును.

(దేవిడిలోనిల్వబెట్టి సాక్ష్యము జెప్పించుట.)

దవే॥వ॥ దేవుని ఎదుట.

రాము॥వ॥ దేవుని ఎదుట.

దవే॥వ॥ ప్రమాణముజేశి.

రాము॥వ॥ ప్రమాన్నముజేశి.

దవే॥వ॥ ప్రమాణముజేశి.

రాము॥వ॥ ప్రప్రప్రమాన్నముజేశి.

ఇన్సు॥వ॥ మొరటువాడు నోరుతిరుగదు అవతలజెప్పుము.

దవే॥వ॥ సత్యముజెప్పుతా.

రాము॥వ॥ సత్యముజెప్పుతా.

దవే॥వ॥ చూచినసంగతి చెప్పుమురా.

రాము॥వ॥ చూచినసంగతి జెప్పుమురా.

దవే॥వ॥ యేమిరా! అట్లమాట్లాడుతావు.

రాము॥వ॥ ఏమిరా! అట్లమట్లాడుతావు.

దవే॥వ॥ తెలివిమాలినగాడ్దీ కుయ్యాకు నిజముచెప్పుము.

రాము॥వ॥ తెలివిమాలినగాడ్దీ కుయ్యాకు నిజముచెప్పుము.

ఇన్సు॥వ॥ రామన్నా! అట్లగాదు. శెట్టిగారిపెట్టె సోమన్న ఎత్తుకపోయినసంగతి చెప్పుము.

రాము॥వ॥ ఈనాయాలు యింట్లా మొరగమండ్లా. పమానమని

మానమని చెప్పితే పభులయెదుట వీనివెంటనే చెప్పవలయు నేమోయని చెప్పినాను. యింక వున్నసంగతి చెప్పుతాలే.

విజ॥ వ॥ అయితే వున్నసంగతి న్యాయముగా చెప్పుము.

రాము॥వ॥ న్యాయమో గీయమో నేను చూచివుంటేగా చెప్పేది.

ఇన్ను॥వ॥ అట్లేకానిలే చెప్పుము.

రాము॥వ॥ నాభార్యకు కడుపునొప్పి అందులోనే తేలుకుట్టడము దాంట్లోనే ముట్టుగానడము.

దఫే॥వ॥ కుయ్యాకు సాక్ష్యము చెప్పరాఅంటే నీదేమియధవగోల.

రాము॥వ॥ నాగోలేముంది శెట్టిగారని గురించినదే.

విజ॥ వ॥ రామన్నా! తీవ్రపడక వున్నసంగతి జెప్పుము. ధర్మదేవత మీగుట్టు బయల్పెట్టక మానదు.

రాము॥వ॥ అప్పుడు నేను వుచ్చబోసుకొనుటకు బజారులోకివచ్చి వానిని గుర్తించినాను.

విజ॥ వ॥ వక్కడేనా యింకాయెవరైన వెంబడివుండిరా.

రాము॥వ॥ వక్కడే యింక యెవరూలెర్రా.

విజ॥ వ॥ ఎన్నిఘంటల కాలమువుండును.

రాము॥వ॥ మాకు ఘంటలులేవు బెస్తవాండ్లకు గంటలు యెక్కడివి రెడ్లకు వుంటాయి.

విజ॥ వ॥ అట్లగాదురా! ఎంతపొద్దువుండును.

రాము॥వ॥ పొద్దా! పొద్దుపొడుస్తావుండును. యెయ్యా పొరపాటుపొరపాటు. పిల్లకోడి నెన్నెత్తివుండును అంతవేళలో.

విజ॥ వ॥ వరే వేళచెప్పుమనిన మింటపిల్లలకోడి వుండినప్పుడని చెప్పతావు. ఆకాసమునా! కోడివుండునా!

రాము॥వ॥ వుంటాదిదేవరా! రేపు కోళ్లుగూసినప్పుడు జూపుత మా యింటితావున పండుకోమల్ల.

ముర॥వ॥ శతభిషానక్షత్రము పిల్లలకోడియనుటల్లోకొక్కి ప్రకారము

యితడీవిధముగా చెప్పియున్నాడు. యిందులో పొరపాటు లేదు.

విజ॥ వ॥ నీవుపొమ్ము. వుచ్చలసోముని పిలావుము.

దఫే॥వ॥ వుచ్చలసోమా వుచ్చలసోమా అనినాలుగుసార్లు పిలుచును

సోము॥వ॥ దండముదేవరా. అనిప్రవేసించును.

దఫే॥వ॥ దేవునిఎదుట.

సోము॥వ॥ దేవునిఎదుట.

దఫే॥వ॥ ప్రిమాణముజేశి.

సోము॥వ॥ ప్రిమాణముజేశి.

దఫే॥వ। ప్రిమాణముజేశి సత్యముజెప్పతా.

సోము॥వ॥ ప్రిమాణముజేశి సత్యముజెప్పతా. దేవరా! నిన్న గంగమ్మకు పూజజేశి రాముడు నేను సముద్రమునకు యేంటకుపోయి వలలువేయగా నావలకుపెట్టెతగులుకొనినచ్చినది చూచి అందులోవున్న సొత్తువులు యిద్దరు భాగములుపోవలెనని గచ్చులరాముడు నాతో చెప్పగా నేను భాగముయివ్వడము లేదనినందుకు షావుకారికిచెప్పి ఫిర్యాది చేయించినాడు.

విజ॥ వ॥ నీకు పెట్టెఎప్పుడు వలకుతగిలినది.

సోము॥వ॥ కోళ్లుకూయు వేళకు.

విజ॥ వ॥ నీవు ఎన్నిఘంటలకాలములో వివాదపడి పెట్టెను యింటికి తీసుకొని వొచ్చినావు.

సోము॥వ॥ గంటలు తెలియవుగాని జానడంతపొద్దు ఎక్కివుండెను.

విజ॥ వ॥ ఇంకనీవు వెళ్లుము.

(ఇనుస్పెక్టరు హీరంగ్)

కామిశెట్టి గోవిందప్ప యింటిలో వుచ్చలసోముడు చోరీశి పెట్టెను దొంగలించినది సత్యము. ఎట్లన ప్రిథివాదియైన సోమ

న్న అప్పుడప్పుడు శెట్టిగారితో అప్పుగా ధాన్యము,దుడ్డున్ను, గుడ్డలు వగయిరా యిప్పించుకొని పోవునప్పుడు పెట్టెవుండినతావు కనిపెట్టి వుండవచ్చును. అట్లు కనిపెట్ట 16 తేదీ ముక్కోటి ఏకాదశిగావుండినందున 17 తేది శెట్టిగారు పూర్తిగా నిదురలో వుందురను నమ్మకముతో సదరు పెట్టెను సోమన్న 10ఘంటల కాలములోనే పోయి తెచ్చియుండుట నిక్కము. (1) శెట్టిగారు ఆలస్యము చేసిన మాలు పరార్ అవునను కారణముతో వెంటనే జప్తీకోరినందున మాలుచిక్కినది. సాక్ష్యమక్కర లేకనే మాలు దొరుకుటచేత యదార్థముగా చోరీచేసినట్టు కేసునమ్మతగినది. (2) యిదియునుగాక శెట్టిగారి సాక్షియైన రామన్న భార్యపడు బాధలకు సహింపక సదరు రామన్న యింటిలోమేల్కొని వుండినందున ఈశెట్టిగారు అరుచుటలో వేగిరముగా యింటిలోనుండ బైటకువచ్చి తనయింటిముందర యుండు రస్తాపెంట పోవుచున్న సోమన్నను గుర్తించినది నిజము. [3] అప్పుడప్పుడు శెట్టిగారితావున లావాదేవి చేయుటచేత పెట్టె యుండుతావు నేరస్థుడైన సోమన్నకుతప్ప యితరాదులకు గుర్తువుండుట అరుదు. గనుక వొకవేళ శెట్టిగారు మేల్కొనివున్న యెడలగింజలనిమిత్తమో దుడ్డునిమిత్తమో అప్పుగా తీసుకొనిపోవుటకు గాను వొచ్చితిననని చెప్పవచ్చునని సోమన్న వుద్దేశించి చోరీచేయుటకుపోయివుండును. గాన యీయుదంత మంతయుచక్కగానాలోచించి ప్రతివాదియైన సోమన్న నేరస్థుడుగా తోచినందున సదరు సోమన్నకు కఠినమైనశిక్షు ధర్మశాసనము ప్రకారము సెక్షన్ అనుసరించి విధించవలయునని కోరడమైనది.

(ముఃరాఠిరావు హీరంగ్.)

వుచ్చులసోమ్ముడు కామిశెట్టి గోవిందప్ప ఇంటిలో ప్రవేశించి చోరీచేసి పెట్టెను దొంగిలించుటకల్ల. ఎందుకన శెట్టిగారు శబ్దమైన

తోడనే లేచి యింటిలోనుండి బైటికి వొచ్చియుండుట అరుదు. శెట్టిగారు నిదుర మైకమునవుండి సోమన్నయే యనిగుర్తించి యుండుట జూడ నిజమనితోచదు. (1) వుచ్చలసోముడు గచ్చలరాముడు చేపల వేటకుపోయి వలలువేయుటచేత సదరుపెట్టె వుచ్చలసోముని వలకు తగిలియుండుట యథార్థము. [2] అందుపైన వాదియైన సోమన్న రామన్న వీరిద్దరు భాగపరిష్కారమున్నకై వివాదపడినది నిజము. [3] యట్లన మనగ్రామము పౌరోహిత రామయ్యగారు స్నానమాచరించుటకు సముద్రమునకు పోయివుండగా సోముకు ప్రతివాదియైనరామన్న వీరిద్దరుమెకెలుకర్చుకొని యుండగా జూచి పౌరోహిత రామయ్యగారు కసురుకొనినను వినక సోమన్న రామన్నే తన్ని పెట్టెతెచ్చినట్లు పైడిఫెన్సు పౌరోహితి రామయ్య స్టేటుమెంటు సత్యమని తోచుచున్నది. [4] గోవిందప్ప శెట్టిగారియింటికి వుచ్చల సోమన్నయింటికి ఫాసలా సుమారు మైలుదూరమున్నది. ఈభారముగల పెట్టెను సోమన్న యెత్తుకొని బజారువెంట పారిపోవుట అరుదు. [5] అప్పట్లో యీశెట్టి అరుపులకు జెనులెందరో మేల్కొనక మానరు. యిదిగాక భారముగలపెట్టె సోమన్ననెత్తిన వుండగా భూమికి వొంగి రాయితీసుకొని శెట్టిగారిని కొట్టడముకల్ల. యిదియంతయు రామన్నకు భాగమివ్వనందున యిట్లు మిషకల్పించి శెట్టితావుకుపోయి శెట్టిపక్షముగా సాక్షి చెప్పెదునని శెట్టికి అనకల్పితమగునట్లురామన్న బోధించి సోమన్నపైన తప్పుఫిర్యాది చేయించి యుండును. ఇట్టి అక్రమమైనకేసు కల్పనచేసి ఫిర్యాది చేసినదానికి యితనిపరంగా అన్యాయముగా సాక్ష్యము చెప్పుటకు పూనుకున్న రామన్నకు ధర్మచట్టము అనుసరించి శిక్షవిధింతురని కోరుచున్నాను.

విజ॥ వ॥ ఇంక నీవెళ్లుము.

(విజయసేనుని తీర్పు)

ఈ సభామధ్యంబున విలసిల్లుచున్న బుద్ధిమంతులైన జనంబు

లారా! ఈగోవిందప్ప శెట్టి యింటిలో పెట్టెపోవుటకల్ల. నామనస్సాక్షియైన పరాత్పరుండు యితని గుట్టంత తెల్లముగా తోచునట్లు జేయుచున్నాడు. ఎట్లనిన పదిఘంటలకాలములో పెట్టె యెత్తుకొని పోయినాడనిన్ని, పండ్రెండనిన్ని మేల్కొని యుండలేదనిన్ని, పెట్టె యెత్తుకొనిపోయ్యేటప్పుడు గుర్తించినాననిన్ని, సాక్ష్యము గచ్చులరాముడు వక్కడేనని చెప్పుచున్నాడు. మరియు ఇంతపట్టణములో బజారు వెంట ఇంత భారముగల పెట్టెను ఎత్తుకొనిపోవునప్పుడు యితనిఅరుపులకు పెట్టె పారవేయక ఎత్తుకొని మైలుదూరముగల సోముని ఇంటికి పోవుటదుర్లభము. ఇదియంత యదార్థముగాదని తోచినందున అనృతము కేసు జేసినందుకు యితనికి అయిదునూర్లరూపాయలు జుల్మానాయున్ను అయిదు సంవత్సరములు కఠినమైనశిక్షయున్ను విధించడమైనది. ఇదియునుంగాక పుచ్చలసోముడు గచ్చులరాముడు వీరియిరువురు వాదించినది నిజము. సదరుపెట్టెలో భాగము సోముగాడు యివ్వనందున షావుకారియైన గోవిందప్ప శెట్టిగారి వద్దకుజని ఫిర్యాదిచేయించడము సత్యము. అందుకు రాముడు అనృతసాక్ష్యము చెప్పినందుకు యితని శిక్ష గోవిందప్ప శెట్టిగారి ప్రకారము విధించడమేగాక జుల్మానా యేబదిరూపాయలు విధించడమైనది. కిర్తిపాలా వీరిని బంధికానలో ప్రవేశింపజేయుము. జుల్మానాపైకము యెల్లుండి వుదయము పదిఘంటలకు చెల్లించునట్లు బరాతముగావింపుము. ఈగడువుమేరకు పైకము చెల్లింపక అభ్యంతరముచేశిన యెడల వుభయులయిండ్లకు జప్తీపంపి పైకము వసూలుగావింపుము. పొమ్ము.

విజ॥ సీ॥ తల్లిదండ్రులుగూడి దగగూడబెట్టిన
దవ్యమంతయుమీరు వ్యయముజేశి।
పరదేశమునకేగి బలుకష్టములకోర్చి
చదివినచదువెల్ల చవుటగలయ।

స్లీడర్లమనిపేరు పెట్టుకనన్యాయ
　　కేసులుపెట్టెడు కుటిలులారా!
అన్యాయవిత్తంబు అవనిపైయెవరికి
　　నిల్వదనియెంచుడీ నీచులారా!
గీ॥ పెద్దబిరుదులు పొందియు బుద్ధిలేక!
బ్రతికినంతనె ఫలమేమి భ్రాంతిచేత!
లోకులకుమేలు జేయనికాకులారా!
బుద్ధిగల్గియు బ్రతుకుడీ పుడమిలోన!

వ॥ అయ్యో అన్యాయంబునకు కంకణముగట్టుకొని ద్రవ్యార్జన చే కొంపలుగూల్చెడు కుంకలారా! మీపెద్దపెద్దవిద్యలు బహుశ్రుతులని బిరుదులుగాంచిన వన్నియు నేటిలోగల్పి యేమిలా యెరుంగని సంసారీకులకు హిందులా మొదలగు లాలెల్ల బయలుపరచి తా జెడుకోతి వనమెల్లజెడెనను లోకోక్తిప్రకారము అన్యాయముగా కొంపలుగూల్చిన పుణ్యులారా! ఇంకనైన మీమనంబుల శాంతివహించి భగవంతుని భజించి మీరుతరించుటయేగాక మిమ్ము సమీపించినవారిని తరించు మార్గముజూపి మనవలయునని సర్వాంతర్యామియైన భగవంతుని నుతింపుచున్నాడ. ఇంక బుద్ధిగల్గి మంచిమార్గమున నడువ్రుడు పొందు.

కీర్తిపాలా! ఈపెట్టె తీయుటకురాదని చెప్పుచున్నారు. శాణములతో కొట్టితీసి అందులోయేమున్నదో చూడుము.

కీర్తి॥వ॥ (పెట్టెకొట్టినట్లు నటించుట.) రాజా ఈపెట్టె శాణములతో కొట్టినను పగులకయున్నది.

విజ॥ వ॥ ఏమీచిత్రము!

పాట - నాధనామక్రియ - రూపకము.

"ఏమిచిత్రమో తెలియదాయె ఎందుజూడలేదునాహా

ఎందుజూడ జూడలేదునహో యిట్టివింతజగములోన ఏమి॥
పెట్టెజూడ దారుమయము కొట్టినానుపగులదాయె
గట్టియగుచున్నదేమొ కనగ దేవమహిమయౌను ఏమి॥
పొందుగాను బ్రహ్మానంద యోగశ్రీమేశుడై నరమా
మందిరునకు తెలియుగాని మనుజులకుసుతరముగాదు ఏమి॥

వ॥ ఏమీ ఈపెట్టె పగులకయుండుటకు కారణంబేమిగా యుండును. ఎన్నివిధముల దీనిని తీయుటకు యత్నించినను రాక యున్నది. హా చిత్రము మంత్రివర్యా ఈపెట్టె భేదింపకుండుటకు కారణమేమిగా యుండును. వచింపుము.

కీర్తి॥ వ॥ ఇదియేమియో? ఎన్నివిధముల యోచించినను మనంబునకు గోచరంబుగాక యున్నది. ఈఆస్థానమందిరము వాకిండ్లుభేదింపబడినట్లు మీకరస్పర్శనంబువలస నేమయిన తెరువంబడునేమో చూడుము.

విజ॥ వ॥ అట్లేచూచెద అని పెట్టె తెరుచును.

సీ॥ ఈమానినీమణి పలకోతలపోయ
 పండుకయున్నది పరమసియతి।
యోగియో భోగియో యెరుగరాదిప్పుడు
 మనుజులకిటులౌనె మహినిజూడ।
ఈమహాతను కాంతి యెలమినిప్పుడుజూడ
 యిందుమండలముతో నెనయునీదు।
పెట్టెలోపలపండి ప్రాణవాయువులట్లు
 పట్టిసాధ్యంబౌనె ప్రజకుధరను।

గీ॥ భూమియందున చిత్రమీ పుణ్యవనిత।
యెవ్వరో నిట్లునుండుట కేమికతమొ।
దైవచిత్రము ఈమెను దలచిచూడ।
నరులుయిటులుండి ప్రాణముల్ నిలుపతరమే॥

వ॥ (స్వగతం] ఈమెయెట్లు పెట్టెలో పవళించి యోగిచందంబున
నుండు కారణమేమో తెలియకున్నది. ఈమెను విచారించిన
అంతయుఁ విశదమగునుగాన విచారించెద. [ప్రకాశముగా]
అమ్మా నీవెవ్వరవు ఇట్లుపెట్టెలోనుండుటకు కారణమేమో
యదార్థము యెఱింగింపుము.

సుశీ॥ వ॥ [స్వగతం]అయ్యో ఈకుమారుంపు జయంతవసంతులఁబో
లి రూపంబునకన్నులకత్యద్భుతంబుగా తోచుచు మావిజ
యసేనునిబోలియున్నవాడు. యిందులకెట్లువచ్చును. వచ్చె
పో. ప్రభువెట్లగున? ఎందుకో నాకీభ్రాంతిగలగినది. యీ
కుటిలకర్ముండైన దుష్టసేనుడు నానందను బ్రతుకనిచ్చియుం
డునా? వానిచేతంజిక్కి తప్పిపోవడము యమునిచేతజిక్కి త
ప్పిపోవునట్లేగదా. నాకేలఈమోహముకలిగినది. మత్పుత్రు
బోలు తనుకాంతిగలజనాదులెందరోయుందురు. నాకెందుకు
ఈఆశపుట్టినది? (ప్రకాశముగా) అయ్యా నేనెవ్వరైతేనేమి?
భర్తపుత్రులబాసిన పాపకర్మిని. నాసంగతితో మీకేమి
యు లాభముండదు. మీరరకుండుడు పుణ్యాత్మా.

విజ॥ వ॥ (స్వగతం) అపురా! ఈమెవదనంబు గాంచినమాజననిఁబోలి
చూపట్టుచున్నది. యీకుటిలకర్ముండైన దుష్టసేనుని బారిఁ
బడక ఈపెట్టెలోపరుండి తన్ను కాపాడుకున్నదేమోనని మ
నంబునకు తోచుచున్నది. అన్నాహారంబులు ప్రాణవాయు సం
చారంబునుఁ లేక తనువున ప్రాణములెట్లు నిలిచియుండును
హా చిత్రము. తొల్లియజ్ఞంబునకై భూమిబాగుజేయనెంచి జ
నకుడుభూమిదున్నుచుండునపుడు నాగేటికి తగులుకొని వచ్చి
నయామందసంబుననున్న శీతామహాదేవిచందంబున తోచు
చున్నది. ఈమెయెవ్వరో విచారించిన తెలియును. [ప్రకాశ
ముగా]అమ్మానీవెవ్వరు? ఈపెట్టెలోనుండుటకు కారణంబే

మి! యథార్థము వున్నసంగతి తెల్పుము.

సుశీ॥ సీ॥ గతభవంబునదోష మతులంబుగాజేసి

పుణ్యహీనంబున పుట్టితయ్య।

విజ॥ కర్మంబుయెవరికి కట్టకుడుపకపోదు

ధరనెంతవారైన దలచిచూడ।

సుశీ॥ భర్తపుత్రులబాసి పరగంగధాత్రిలో

ప్రాణముల్ నిలిపిన పాపినయ్య।

విజ॥ పతిపుత్రులనుబాసి పరగనీపెట్టిలో

నుండుటగతేమేమి యెరుగచెల్పు।

సుశీ॥ గీ॥ కర్మమునఇట్టి యెడగాటు గల్గెనయ్య।

విజ॥ పుత్రులెందరు నుండిరి పుణ్యసాధ్వి।

సుశీ॥ సుతుడు గుణవంతుడొకడును సాధ్వియొకటి।

విజ॥ అమ్మవారలపేరులు నెమ్మిచెల్పు।

సుశీ॥ విజయసేనుండు పుత్రుడు విమలపుత్రి॥

విజ॥ వ॥ హాదీనదయాళో ఈమహాసాధ్వీమణి సత్యంబుగా మామా

తయే యిందుకుయేమి కొరంతయుఁలేదు.

(అని విజయసేనుడు తన తల్లిపాదములపై బడును.)

సుశీ॥వ॥ హాసుతా! ఎన్నిదినంబులకు నిన్నుఁజూడనాయరా తండ్రి.

విజ॥ గీ॥ ఈసథింబునవిధిబాపె యెడలుమనకు।

పూర్వకర్మంబు కుడుపక పోవదమ్మ।

సుశీ॥ కర్మమెవరికిదాటుట కాదుతండ్రి॥

విజ॥ కర్మదాటెడు వారలు గలరుజనని।

సుశీ॥వ॥ కుమారా ఈధరాతలంబున నెట్టివారికైన కర్మ కట్టకుడుపక

విడువదని చెప్పుచుండ కర్మంబెవ్విధి బాటగలరు.వచింపుము.

విజ॥ వ॥ అమ్మా కర్మత్రివిధంబు. అందువిహితంబు కర్మంబనియు అ

హితంబు వికర్మంబనియు, విధివిహితంబైన కర్మయే ఫలాపే

క్షగలవారికి ఫలంబునొసంగు. అట్టికర్మయే ఫలంబుగోరక చే
సిన అకర్మంబనంబడు. అట్టిఅకర్మాచరణులయిన మాన్యు
లే, కర్మత్రయంబుదాటిముక్తులై వెలుంగుచుందురనియు, ఈ
శ్వరునుద్దేశంబు నట్లేయున్నదని నెరుంగుము.

సుశీ॥వ॥ కుమారా నీసోదరియైన విమల యెక్కడయున్నది. చూపిం
పుము.

రాజ॥ వ॥ అమ్మా నిన్నెడబాటుగలిగించి యదయుండైన యాదుష్టసే
నుడు అరణ్యంబున మాశిరంబులు నరికిరమ్మని తనమిత్రుల
నుబెట్టిపంపిన వారు అర్ధరాత్రింబున కికారణ్యంబున మాశి
రంబులు నరుకయత్నించిన వారికాళ్లపైనఁబడి ప్రార్థించిన
మమ్ముచంపజాలక మాపైనఁగల నొత్తులు వుచ్చుకొనిపో
యిరి. తదనంతరము విమల యీయరణ్యంబున నడువనోప
కున్న నొకవటవృక్షంబె నండజేశి సోదరినిదురింపుచుండ కు
టిలరాక్షసుండొకడు కొండబిలంబులు వాపోవ కేకలువే
యుచు వచ్చుచున్న చందంబుగనుంగొని యిందిరారమణు
పదంబులు మనంబునసిల్పుకొని యాకుటిలుని బారిబాపి ప్ర
హ్లాదున్ని రక్షించిన చందంబున రక్షింపుమని మొరలిడి ధై
ర్యంబవలంబించి నిలుచుండ భక్తపరాధీనుండగు పుండరీకా
క్షుకరుణ నాముందర నొకఖడ్గంబుగాన్పించిన నది కేలఁధ
రియించి యాకుటిలాత్ముఁడు నాతో యుద్ధంబుగావింప నిల్వ
నోపక పరువిడిన వాని వెంటఁబడి కొంతదూరము తఱిమివ
చ్చునంతలో విమల యెందుపోయెనో తెలియక కొంతసేపు
విలపించి యాఖడ్గంబుచే హృదయంబు పగుల్చుకొని మృతి
నొంద యత్నించిన భగవంతుండు దరిశనంబొసంగి అభయ
మొసంగి ముందు సోదరిసహితంబు తల్లిదండ్రుల గాంతువు
పొమ్మని యాజ్ఞాపించినవచ్చి ఈపురంబునకు జేరితి. యిందు

ప్రభువులేకయున్న నన్ను ప్రభువుగా నిర్మించిరి. భగ
వంతుని యాజ్ఞచొప్పున నిన్నుఁగాంచితి. ముందు తండ్రిని
సోదరినిఁ గాంచుట నిక్కంబని నామనంబున నిశ్చయించి
నాడ. ఇందుకు సందియమిసుమంతైనలేదు. ఇదియంతయు
నిజంబని యెరుంగుము జననీ.

సుశీ॥గీ॥ అడవులందుల మృగముల వాతబడెనొ।
యిడుములేపిధిగల్గెనో పుడమియందు।
బాలసుకుమారినిన్నెడ బాసియుండ।
దట్టిదానికి విధికర్మ యిట్లులొాదవె॥

వ॥ నందనా నిన్నెడబాసి నిమిషమైనను నిలచియుండని సుకు
మారియైన విమల అరణ్యంబులో యేమయ్యనో? ఏరాక్షస
మృగపన్నగంబులచే బాధపడెనోగదా కుమారా.

విజ॥ వ॥ అమ్మా నీమనంబున వ్యసనంబుదక్క పూరకుండుము. న
న్నుంగాంచినట్లు నాసోదరిని మాతండ్రినిఁ జూడగలవు. యిం
క తడవుసేయక మజ్జనకద్రోహియైన దుష్టసేను మిత్రియు
తంబు గూల్చివచ్చెద. నన్ను దీవించిపంపు.

సుశీ॥గీ॥ దుష్టసేనుని ధరయందు ద్రుంగజేసి।
ప్రజకుగల్గిన కష్టంబుబాయజేయ।
లెమ్ము వేగంబె జయము చేకొమ్ముతనయ।
అజుడుహరియును ఈశ్వరుండరశినిన్ను।
బ్రోచుచుందురు పొమ్మసుపుత్రినిన్ను॥

వ॥ నందనా యెల్లవిధంబుల లక్ష్మీకాంతుడును అజుండును శం
కరుండును నీకేకష్టంబులు గల్గకుండ రక్షింతురుగాక! సురక్షి
తంబుగా పొమ్ము. జయంబుగొనిరమ్ము. కుమారా.

(అని నిష్క్రమించును.)

విజ॥ గీ॥ ధర్మమునకు భంగంబు దానుజేయ।

నెంచిమంత్రిని జంపితానేర్పడంగ।
మమ్ము కష్టాబ్ధిముంచిన మానహీను।
దుష్టసేనునిద్రుంపంగ త్వరగమనము॥

వ॥ భోవలయునుగాన మనబలంబును వెడలజేయునట్లు సేనాధిపులైన రాజన్యుల కెఱిగించి పంపుము. యిదేనేనును వెడలుచున్నాను.

కీర్తి॥వ॥ మంచిది యుద్ధంబునకు శిద్ధంబుగా సేనవెడలె నీవుగ వెడలుము.

విజ॥ వ॥ అట్లనే వెడలుచున్నాను. నీవు నేనచ్చునంతవరకు పురంబు కాపాడుకొనుము. పొమ్ము.

కీర్తి॥ వ॥ చిత్తము అని నిలుచును.

రంగము 5

---

దుష్టసేనుడు అతని పరివారముతో ప్రవేశము.

పాట - ఖైలాగ్ - నాటకురంజి ఆది

వోరిమిత్రులార యిటురండూ పనిపాటలున్నయవి వోరి॥
క్రూరవృత్తియనకమీరు తీవ్రమేనాయాజ్ఞతోడ
ధారుణీశుపట్టితెండు దర్పముతోడా
కోరికాళిదేవికిని కూరిమితోబలియొసంగ
కాళిసంతసించెనేని గల్గుసుఖము మనకునేడు వోరి॥
కష్టుడగుచునన్నుబట్ట కారగారమందునుంచ
యిష్టసఖులతోడ మంతసంబుజేశిన
కష్టుడైనసత్యసేను కట్టితీవ్రమునరండుపొండు
యిష్టముగకాళికీని విందుజేతమూ వోరి॥
కాళీహ్రాంకారీ హ్రీంకారిమంకాళియని

మంతనంబు నందు నెపుడు మరువకుండుడీ
కామితార్థసుఖమునిమ్మ కరుణతోడమాకటంచు
భూమినాథుబలియునిచ్చి పొందుదామువిష్టసుఖము లోరి॥

వ॥ వరే మిత్రులారా! నాయాజ్ఞచొప్పునఁబోయి కాళికాదేవికి బలినిమిత్తముగా నుంచిన సత్యసేను సహితంబుగా యున్నవారిని యీదినంబున కాళికాదేవికి బలియొసంగి యిష్టార్థసుఖంబు లనుభవింపవలయును. తీవ్రముగా తీసుకొనిరండు. పొండు.

మిత్రు॥వ॥ చిత్తము. (జనాంతికముగా) వోరీ సుంకా యానృపుండైన సత్యసేనుఁడు సత్యంబెజయంబని కలనైన నసత్యంబుగానని మహానుభావునకెట్టికష్టమువాటిల్లె! హాదేవా! భక్తజనంబుల కష్టంబులు నష్టంబులుగావింప అనేక అవతారంబులనెత్తి ధర్మస్థాపనజేయుచుందువని మునిజనంబు లనుదినంబు మనంబుల దలంతురు.అట్టిదయజూపి ఈరాజునురక్షించి ఈయాపద దొలంగింపుము పరాత్పరా.

సుంక॥వ॥ వరేయంకా ధర్మమేజయమన్న వాక్యంబునేఁడుగదా గానవచ్చుట. సుశీల యేచందంబుననో దుష్టసేనుని వారింబడకతప్పె. యిదియునుగాక యామెపిల్లలైన విజయసేన విమలలును వారియిష్టదేవత మనహృదయమునజేరివారినిచంపక బ్రతుకజేసె. యిప్పుడీ నృపకుంజరుఁ బ్రతికించినఁగదా సత్యంబుబలమని మనమునమ్మి నర్తించుటకు కారణము. అని పోయి రాజును విమలను కాళికి బలియొసంగుటకు గొనివచ్చుట.

(దుష్టసేనుడు కాళికాదేవిని వరములడుగుట.)

పాట - హైలాగ్ బ్యాండు - ఏకతాళము

కాళిబోవి వే కరుణించిమమ్మేల

నీలీల తెలియవశము గాదు నేరిశీథరా కాళి॥

ప్రణవరూపిని పాలించిబోవ్రుమా

ననయమూనిన్ను నమ్మినాము మనములోవులా కాళి॥

త్రిగుణరూపిణీ అగణితైశ్వరీ

జగముద్ధ్రంప బెంపజాల దమ్మరోనీవూ కాళి॥

వ॥ సృష్టిస్థితిలయ హేతుభూతున్త్రైన నీకు యీదినంబున స రబలి యొసంగుచున్నారముగాన మాపూజలంగీకరించి మాయిష్టంబులగు వరంబుప్రసాదించి మమ్మను గ్రహించు జననీ. మిత్రులారా! ఈభద్రకాళికి కుంభంబును టెంకాయి సమర్పించి పిదప ఈసత్యసేనుని తక్కినవారిని బలిగావిం పుడు.

మిత్రు॥వ॥ దుష్టసేనమహారాజా యెవ్వరో అనేకమంది గుంపుగాజేరి మనసమీపమునకు వొచ్చుచున్నారు. యేమిసేయుదము.

దుష్ట॥వ॥ ఏమిసేయుదమనియా? యేలభ్రమించెదరు? యీవచ్చెడువా రిని కాళికాదేవికి బలగావింతము తొందరేమి? యింక కాళి కాదేవికి పుల్కాపనగావించి అలంకారము చేయుడు. మి త్రులారా.

[విజయసేనుడు సైన్యము సమీపించుట.]

విజ॥ వ॥ సేనాధిపతీ అదో మనముందర మ హాల్లాసంబుగా రక్త పుష్పంబులు రక్తమాల్య ఆభరణంబులుధరియించి యిక్క డనున్న కాళికాదేవికి బలిజేయునట్లు పశువులనో మనుజుల నో? యెవ్విధి బలిజేయపూనియున్నవారో చూడుడు.

మంత్రి॥వ॥ అయ్యా విజయసేనమహారాజా వారుగావించు కార్యము చూచుటకే భయమగుచున్నది. ప్రియంబు మీరియున్న నొకపురుషునికి నొకబాలికకు కంఠంబున నెర్రటి పుష్పహా

రాదులు వేళ మధ్యాంబుదాఁపుడని బలవంతంబు జేశినను వా రు తాఁగక అందులో వృద్ధుండగు యాపురుషుండు తాఁగ నొల్లక నాప్రాణంబులు తీయుడని మొరలిడుచున్నాడు. యి ట్టియిక్కట్టు తప్పించుట మహాఫలంబని తోచుచున్నది.

విజ॥ వ॥ అయ్యో శివశివా యి దేసింధుపురంబునకు సమీపించితిమి. యాదుష్టాత్ముండైన దుష్టసేనుడు యిక్కార్యము జేయుచు న్నాఁడో యేమో తివఁమే పోదామువదండి అని (అందరు ని ష్క్రమింతురు.)

[కాళికాదేవిదగ్గర సత్యసేనుడు పఁలాపించుట.]

సత్యసేనుని పాట - తైలాగ్ - హిందుస్తాని ముఖారి ఆది.

పరమపురుషకృపా పాలనజేయవే
దుర్గతులు ఈ వేళ నరిక దలచిరిమమ్ము పర॥
ధర్మమునిల్పగా దలచి భవంబును
ధరణిలో పుట్టుడు దానవహరణా పర॥
యాపద బాపిము శ్రీపతీనీకృపా
భూమియుఁబ్రోవవే తాపసహృదయా పర॥

సీ॥ శరణార్థులనుబ్రోవ జననమైభక్తుల
కరుణతోఁబ్రోచిన కమలనాభ।
కంసాదిఖలులను కడగిసజ్జనులకు
భంగంబుదలచిన బ్రోవ నెంచి।
యాదుష్టులనుగొట్టి యవనిసజ్జనముల
ప్రియమారపోషించు పుణ్యమూర్తి।
ఈసమయంబున ఈదుష్టజనములు
పట్టికాళికిగొట్ట బూనినారు।
గీ॥ ఇట్టియాపదదప్పించి యిడుములుడిపి।

మహిన్నురక్షించు మాయయ్య మొఱకుడిపుడు।
నిర్మలాత్మక నిత్యాత్మ నిర్వికార।
ధర్మభంగంబు గాకుండ దయనుబ్రోవు॥

వ॥ పుండరీకాక్షా విపన్నజనంబుల కృపఁబ్రోతువని శ్రుతిస్మృత్యాదులు మొరపెట్టుచున్నవి యదార్థమని ఈయాపద గలుగకుండ తొలంగించి రక్షింపు. లక్ష్మీనాథా! ఆపద్బాంధవా! ముకుందా! పరాత్పరా! కృష్ణా కృష్ణా! బ్రోవుము.

దుష్టసేనుడు తనపరివారముతో విజయసేను నెదుర్కొనుట.

దుష్టసేనుడు విజయసేనుని సంవాదము పాట - సైలాగ్ బ్యాగ్ ఏక

యెవ్వరు యెవ్వరు యెవ్వరురా
యేటికియిందుల కొచ్చితిరీ
నవ్వాకొవ్వా యిప్పుడు
మిమ్మలనందర బలిగావించెదరా యెవ్వ॥

విజ॥ బలిగావింపగ నలవిగాదు
మాబలముచలంబును చూచెదవూ
యిలపైదుష్టుల దండించియునే
ధర్మమునిలుపగ వొచ్చితిరా బలి॥

దుష్ట॥ ధర్మమునిలుపగ నలవిగాదు
నామర్మమెరుంగక వొచ్చితివి
నిర్మలమతిచే కాళీదేవికి
నిప్పుడు బలిగావించెదరా యెవ్వ॥

విజ॥ తులువతనంబున నెందరినోయిటు
కలుషుడవై బాధించితివి
తులువానీదగు యిష్టదైవతకు
బలిగావించెద నిలువుమురా బలి॥

దుష్ట॥ కండ్లకొ్రివ్వుచే మెండొడ్డియు
నాదండను జేరితిపొ రొరా
దండించియునిను భండనమందున
కండలుతరిగెద చూడుమురా యవ్వ॥

విజ॥ కండ్లకు పొరగమ్మియుగానక
కారులుగూయకు తుచ్ఛుడవై
ఖండితముగనిను ఖండించెద
కలుపాధమనాదగు ఖడ్గముచే బలి॥

దుష్ట॥వ॥ వరే మదీయభుజాబల పాండిత్యంబెరుంగనేరక ముచ్ఛుతనంబునవచ్చి నాకార్యంబునకు హానిచేయనెంచిన నీచా నీ వెవ్వడవు? యథార్థము జెప్పుము.

విజ॥ గీ॥ సత్యసేనాఖ్య జగతిప్రసిద్ధిబూని।
నట్టిమహనీయు పుత్రుండ నరయుమిపుడు।
ముచ్ఛుతనమున మంత్రిని మోసపుచ్చి।
తలనుగొనినపాపాత్మ తులువవినర॥

వ॥ అంతటనైనా కళదరక ధర్మకర్మ నిర్మితుండైన మజ్జనకుండు నీకుఅగ్రజుండును మాన్యుండని మనంబుననెన్నక పాపంబున కొడిగట్టి అతనిచంపనెంచిన, ఈశ్వరానుగ్రహంబున నది తప్పె. పరమపతివ్రతయు అగ్రజుని భార్యయు మాతయని మనంబుననెన్నక కామించినకలుపాత్మా! ఇట్టిపాపంబు నిన్నుచలపట్టి హింసింపకమానునా? నీకర్మయే నిన్నుహరించు. యింకను నోరులవలన ప్రయోజనంబులేదుగాన, మదీయ కరవాలంబున శిరంబుఖండించి ప్రేతరాట్పురికి కాపురంబుండ బంపుచున్నాను నిల్వుమురా కలుపా.

దుష్ట॥గీ। అహహనాదైన శౌర్యంబునరయకిట్లు।
ముచ్ఛుతనమున ననుబట్టవొచ్చితౌర।

నిన్ను నీతండ్రి నిప్పుడే నిమిషమునను।

కొట్టెదన చూడు శిరములు గూలిపడగ॥

దుష్ట॥ వ॥ వరే మదీయాజ్ఞ చొప్పున మిమ్ము జంపక అరణ్యంబులో వి
డిచివొచ్చిన యంకుటిలాత్ములను మిమ్మును నాయిష్టదేవత
తనివిదీర ఈదినంబున విందుగావించెద జూడరాకుటిలా.

విజ॥ వ॥ నరేతులువా ధర్మంబునకు హానిచేయ నెంచిన నెరవేరునా.
యిదికానికార్యము. ధర్మమే దైవముగాన ఇట్టి దైవమే ఈ
సమయమునకు నన్ను ఇక్కడికివచ్చునట్లు సంకల్పము చేసిన
దగాన నీఅసువులు నిల్వవని యెరుంగుము.

విజయసేనుడు దుష్టసేనుని సంవాదము పాట - డైలాగ్ - బ్యాగ్ అది

దుష్ట॥ యాలనురాయిటు పేరిలెదునాదగు
యడిదంబున నీ శిరములనూ
గూలగజేసెద నీదుజనంబులు
గోడుగోడుమని యార్వగనూ యాల॥

విజ॥ వ॥ యవ్వరివారలు గోడుగుడిచెదిరిక
యెరిగెదు నొకనిమిషములో
కొరివ్వనజేశిన క్రొర్యపుకర్మము
గోడుకుడుపక విడువమురా యవ్వ॥

దుష్ట॥ భీమంబగునా యడిదముచేతను
భూమిక్ పడవేసెదశిరముల్
పామరులగునీ తలితండ్రిదులు
పేరిమలుశింబటు యార్వగనూ యాల।

విజ॥ కలుషానీదగు కరవాలంబును
తునియలాయె జూడుమురా
పలువానిన్ను పట్టితీసెదగు
తులవతనంబును మానుమురా యవ్వ

వ॥ వరేపాపీ నీబలంబునునుగ్గించి నిన్నుఁ బంధించితి యింక నీ యిష్టసఖు లెందుపోయిరిరా కలుషాత్మా? నిన్నిపాశంబులం బంధించి మాతల్లితండ్రుల యాజ్ఞచొప్పున నిన్నుశిక్షించెద చూడరా దురాత్మా.

(అని విజయసేనుడు దుష్టసేనుని బంధించును.)

సేవకా నీవు వేగంబునఁజని మాతలిదండ్రుల తోడ్కొని తీవ్రమేరమ్ము. పొమ్ము.

సేవడుకు తలిదండ్రులతో ప్రవేసించును.

వందనంబు జనకా.

సత్య॥వ॥ సుఖముగా వర్ధిల్లుము కుమారా.

విజ॥ వ॥ జననీ మనలఁ బాధపరచిన యాకుటిలాత్మబంధించి నీవు ను మాతండ్రియు జెప్పినవిధంబున వీనికి శిక్షగావించెద. వ చింపుడు.

సుశీ॥వ॥ తులువతనమునకలుషుఁడై తెలియఁడీడు।
దుర్మదంబునగావించె దోషమిపుడు।
నట్టిదోషంబె గర్వంబునణచెవీని।
ప్రాణమున్నంత కాలంబుబంధురముగ।
బంధికానలో వేయుముపరమనీచు॥

విజ॥ వ॥ మీయాజ్ఞచొప్పున ఈకుటిలకర్మునికి చెరశాలవిధించెద. భటులారా! వీనిఁగొనిపోయి కారాగృహబద్ధుని గావింపుడు. పొండు. జనంబులారా! కుటిలుండై మిమ్ముబాధించిన ఈ మూర్ఖుని బాధ బాసె. యింక సుఖముండుపొండు. మేముఁ పోయెదము.

(దుష్టసేనుడు భటులుదప్ప మిగతవారందరు నిష్క్రమింతురు.)

దుష్ట॥సీ॥ తులువతనంబున పలువరింపుచునుండ
పరకాంతలనుబట్టు పాపినయ్యు।

పాపపుణ్యంబులు పాటింపలేవని
పల్కుచుండినబహు తులువనయ్యా।
ధర్మంబు ద్వేషించి ధర్మపాలునితల
నుర్వికూల్చిన దుష్కర్మినయ్యా।
అన్నతండ్రినువాక్య మాకడిబుచ్చియు
చంపబూనిన దుష్టజాతినయ్యా।
ప్రజలకుబహుసధ భంగపాటొదవించి
కలుషమార్జించిన కష్టినయ్యా।
తల్లితోసమునని దలపక మర్త్యబుద్ధి
పట్టబూనితినన్న భార్యనయ్యా।
సర్వవిషయంబులు యుర్విభోగించుటే
స్వర్గంబుయనిచాట జూచితయ్యా।
ధర్మంబు ద్వేషించి దుర్మదవృత్తిచే
ధర్మభంగంబు జేయదలచితయ్యా।

గీ॥ యెన్నియత్నంబులోచాల నిలనుజేయ।
ధర్మధర్మమయ్యెను దలచిచూడ।
ధర్మమునకాని లేదుహో ధరణియందు।
వెయ్యునేటికి ననుజూడ విశదవడును॥

వ॥ అయ్యాలారా! ధాత్రీతలంబున యింద్రజాల మహేంద్రజాల అగ్నిస్తంభన జలస్తంభన వాయుస్తంభన వశీకరణ ఆకర్షణ ఘటికామూలకాది నానాప్రయోగంబులైన విద్యలన్నియుయు సత్యంబు క్రిందసాగవయ్యె. సత్యంబులేదని అసత్యంబుబూని సత్యప్రజ్ఞుండైన సత్యసేనుని బిడ్డలతో జంపదలంచిన యమ్మహాత్ముని సత్యమే నతనిభార్యా పుత్రీపుత్రికలను తన్నును మృతంబుగాకుండ ఈదినంబు రక్షించినచందంబునంతయు మీాకన్నలార జూచితిరిగదా! యిదివరనుంచి

పాపకార్యంబులార్జింపక పుణ్యకార్యంబులు యథావిధిగా నాచరింపుచూ కుజనగోష్ఠి వదలి సుజనులకూడి వారికి యెన్నియిక్కట్లు పొసగినను ఈశ్వరానుగ్రహంబున విదళించినరిని అతిశయానందంబు ననుభవించుట కిసుమంతే ని సంశయముండదు. యింక మీామీా మందిరంబులకుఁబో యి సుఖంబుండుఁడు. నేను చెరసాలకు వసించెద యింక పొండు. బుద్ధిగలిగిమనుండు.

మంగళహారతి పాట - శైలాగ్ - ఏకతాళం.

పాహిమాం దేవదేవ భక్తపోషమంగళం
తాపసానేకవినుత ముక్తిదాతభక్తవరద పాహి॥
సచ్చిదానందరూప స్వప్రకాశసర్వవ్యాప
వేదవేద్యబోధరూప సాధుహృదయవిశ్వరూప పాహి॥
అఘవినాశఅద్వితీయ నిగమరూపనిశ్చలాత్మ
బ్రహ్మానందయాశ్రిమేశ భవవినాశి భక్తరక్ష పాహి॥

విజయసేన మహారాజు నాటకము.



